కాపాడుకొనుము" అను నీతి నీతివాక్యము కలదు. వైద్యశక్తి యున్నవానికి మానవునకు కేమియో తెలియుటయేది అట్టివాని ప్రాణము కాపాడుకొను టెట్లు? తనను తన పొరుగు బిడ్డల నూవమును కాపాడుకొన సెంచువాడెప్పుడు వైద్యశాస్త్రము తెలిసికొనునట్టి దుండగ కార్యములలో చేరరాదు.

## సంఘాభివృద్ధి

సంఘాభివృద్ధికి మీరు చేయవలసిన పని చాలకలదు. మానవులందరి మన్నిటి విషయముల నభివృద్ధి పొందియున్న తెమ సంఘము అభివృద్ధి పొందినట్లే. మనము నీతిలో, దేహారోగ్యములో, ఆర్థికస్థితిలో, విద్యావిషయము ఆదిగాగల సర్వవిషయముల మనము అన్ని సంఘములతో బాటు పైకి రావలెను. నీతి నేర్చుకొనుటకు ప్రస్తుతః పుట్టుకలో కొంత యుండును. తల్లిదండ్రుల పర్వ్రిపర్తన కొంతపని చేయును. సత్సాంగత్యము కొంత సాయపడును. సైన్యస్వగృహ్య సద్గ్రంథపఠనము పన్నిటి నేగలదు. దేహారోగ్యమునకు శుచి, సదాలోచన, నియమము, పరిశ్రమ ఆవశ్యకము. దేహారోగ్యము లేని మానవుడు నిరర్థకుడగును. ఎట్టి ఘనకార్యమును చేయజాలడు. ఆరోగ్యమునుబట్టి బుద్ధికూడ నడచుచుండును. ఇట్టి ప్రశస్తవస్తువగు ఆరోగ్యమునకు పునాది బ్రహ్మచర్యము కాపాడుకొనుట. మన బాలబాలికలను తమ ప్రారంభ జీవితమున మంచి నియమముల నుంచవలెను. బాలురకు యిరువది మూడేండ్ల వరకు వివాహము చేయకుండుట బాలికలకు పదునారేండ్లవరకు వివాహము చేయకుండుట మంచిది. తగిన అవకాశముల నేర్పరచుకొని యాకాలది వయస్సువరకు బ్రహ్మచర్యవ్రతమును నిలుపుకొనుట మానవమునగల మానవజాతికి లభ్యము కానిది కాదు. ఆర్థికస్థితియందు మనమెంత జాగ్రత్తతో నున్న అంతమంచిది. అన్నియుండి దానికి తగిన ధనమునూడ నున్న ప్రోత్సాహకముగ యున్నది. ప్రకాశింప జేసుకొనుటకు వీలగును. మనుజుడు కష్టపడి పనిచేసి యుక్తమయిన ఫలము చేసికొనుచు దంబమునకు కాలియక, అధికునితో కీనయాత్ర గడపుచే సుఖజీవనము. ఈ సందర్భమున స్వాభిమానము గాని లేక స్వదేశీయ యితరదేశపమలు, కాయకష్టములు చేసుకొనువారుగాని ప్రభుత్వమువారు మనకు తోడ్పడిన కో ఆపరేటివు సంఘముల పద్ధతిని సరిగ యుపయోగించుకొన్నచో చాల సాయపడగలదు. అట్లుగాక తక్కువ వడ్డీకి అప్పులిచ్చుచున్నారు గదా యని తెచ్చుకొని దుర్వినియోగపరచి తెద్దు చూపించెదను అను తత్వము గలవారికి ఆ బ్యాంకులే రాక్షసస్వరూపములై మనకు ప్రస్తుత బీదస్థితికి ప్రభుత్వమువారుగాని లేక దేశనాయకులుగాని మనయందు దయగల్గి ప్రత్తి పండించుకొని నూలు వడుకుకొని బట్టలల్లుకొని స్వదేశ ఖద్దరు బట్టలను ధరించుకొనుటలో మనకు దోడ్పడి ప్రోత్సహించుకొని దాని సాధించుటలో తప్పలేదు. ఇక విద్యావిషయమున చెప్పుట కెంతయో కలదు. విద్య మానవుని కెట్లు వన్నె తెచ్చునో వదిమీ రెరుంగువది కాదు. అట్టి సద్విద్యను మన బాలబాలికలకు పెంపొందింపజేసి సకలకళా ప్రావీణ్యులని పేరుగాంచిన పల్లవరాజుల ప్రఖ్యాతి కాపాడుకొనుదని కోరుచున్నాను. విద్యకై ప్రారంభమునుండి అంత్యమువరకు మానవుడు కృషి చేయవచ్చును. ప్రాథమిక విద్య నభ్యసించునప్పుడే బాలబాలికలు మంచిదారిలో పడినవారికి పై విద్య తేలికయగును. ఉపాధ్యాయులు మంచి సాధనసంపత్తి గలవారై విద్యార్థులకు తగిన సద్విద్య గరపుచుండవలెను. అట్లుగానిచో మన ప్రయత్నములన్నియు వ్యర్థమై పోవును. మనలో ఇప్పుడిప్పుడు విరివిగ వచ్చుచున్న యొలిమెంటరీ ట్రెయినింగు యుపాధ్యాయుల కిది యొక హితవాక్యమని గ్రహింతురుగాక. ఇక మనము స్త్రీ విద్యను నిరసించకూడదు. అవకాశమున్నంతవరకు మన స్త్రీలు విద్యావతులై యుండునటుల చూచుట మనవిధి. పురుషుల వలెనే స్త్రీలకు విద్య లేనిది కుటుంబమునకు గౌరవము లేదని తమ్ముడు.

## స్త్రీ పురుషసమానత్వము

లోకమున స్త్రీ లెట్టినీతికి కట్టుబడి యుండవలెనని పురుషులు కోరుదురో అట్టి నీతిని పురుషులును యెన్నడును జవదాటరాదు. స్త్రీలు పునర్వివాహమున కనర్హులైనప్పుడు పురుషునికి మాత్రమట్టి యర్హత యేల కలుగవలెను? ఇదిగాక పురుషుడు యొక భార్య యుండగనే రెండవ భార్యనుకూడ చేబట్టుట అమానుషము కాదా? హైందవ స్త్రీకి ప్రథమభర్తను విడనాడి క్రొత్తముగ నింకొకని వివాహమాడుట యెంత లజ్జాకరమో పురుషుడుకూడ తన ప్రథమభార్యను విడనాడుట కటుల పరితపించవలెను. ఇక పురుషులు యిద్దరిభార్యల నుంచుకొనుటకు స్త్రీ యిద్దరు మగలను యేర్పాటు చేసికొనుటకు యెట్టి భేదా యుండదు. గాన ఇందుకల గౌరవాగౌరవములు వ్యక్తులకే విడచుకాల మాసన్నమైనదని యుంటకింతె హెచ్చు చెప్పదలచుకొనలేదు.

## యువకులు

సంఘాభివృద్ధి యంతయు యువకులపైన నాధారపడి యున్నదని ప్రపంచము ప్రతిధ్వనించుచున్నది. పెద్దల సలహాసాయముల కైకొని యువకులే దేశీయుల మన కార్యనిర్వాహము నకుంగల సాధనసామగ్రిని యేర్పరచుకొందరో బాగుగా యోచించుకొనుడు. ధనము నెట్లు ప్రోగుచేయుదురో, విద్యకై కోష్టలంతె నిర్మింతురో, పరిశ్రమలకై ఆశ్రమములె నెలకొల్పుదురో మీ పైననే యాధారపడి యున్నది.

## పత్రికల యుపయోగము

ఈ విషయమున యొకరి భావముల నొకరు తెలుపుకొనుటకు, మనము చేయుచున్న పనిని మనమనుభవములను ప్రకటించుకొనుటకు, వార్తాపత్రిక యొకటి అత్యావసరము. ఇట్టి సహాయకారకమైన మనసంఘపత్రిక మనము పోషించుకొనుట మన జన్మహక్కుయని భావింపుడు. అప్పుడు కల ప్రబోధిని శాశ్వతముగ నిలుపుకొనుడు.

## ముగింపు

ప్రియసోదరులారా! పై విషయములన్నింటిలో గల ప్రాముఖ్యతను గమనింపుడు. సత్యమెప్పుడు ఒకేగూటిగ నుండును గాని వంకరటింకర దారులెరుగదని గ్రహింపుడు. ఐకమత్యము సర్వశ్రేయమునకు అటపట్టని మరువకుడు. కార్యదీక్ష జయము నొడగూర్చునని విశ్వసింపుడు. ఒక పత్ని, ఒకమాట, ఒకబాణము నే పొందియున్న యా శ్రీరామచరిత్రము సదా మననము చేయుచుండిమేని మనకు సద్వర్తనము, సర్వసౌఖ్యములు సిద్ధించును.

ఓం శాంతి శ్శాంతిః

---

చెన్నపురి సంగీతసమాజము:—ఈ సమాజము యొక్క చందాదారుల సభ 8-వ తేది బుధవారము సాయం కాలం 5-30 గంటలకు తంబుశెట్టివీధి నెం. 320 గృహమందు జరుగును.

## గ్రామపంచాయితీలు, తన్నిర్వహణము

గ్రామ పంచాయితీలు తన్నిర్వహణమును గూర్చిన వ్యాసపోటీపరీక్ష నిదివరలో యేర్పాటుచేసి ప్రకటించి యున్నాము. పోటీకి వచ్చిన వ్యాసరాజముల పరిశీలించు పరీక్షాధికారుల సమకూర్చుట దుర్ఘటమైనది. ఇంకను అనేకకారణాంతరములచే కాలాతీతమైనది. ఎట్టకేల కిప్పుడిపుడు వారిని సమాశేకపరచుచున్నాము. 1930 జనవరి 30 వ తేదీలోపుగ వ్యాసముల స్థానముల నిర్ణయించి అగ్రస్థాన మలంకరించిన వారలకు బహుమతు లంపుచు వారి వ్యాసముల ప్రతికాముఖమునను ప్రకటించుదుము. కార్యనిర్వాహణమందలి కష్టముల విచారించి అభ్యర్థు లాలస్యమునకు క్షంతవ్యులుగా భావింపకుందురుగాక!

బొప్పన వెంకయ్య

ప్రెసిడెంటు, పెదపాలపర్రు గ్రామపంచాయతీ.

---

## కావలయును

కాకినాడ ఆంధ్ర బాలవితంతు శరణాలయమున నుండు బాలవితంతువులకు పునర్వివాహము చేసికొనుటకు వరులు కావలయును. (బ్రాహ్మణులు, వైశ్యులు, నాన్ బ్రాహ్మణులు) కోరువారు క్రింద సంతకము చేసియుండువారికి వ్రాయవలయును. వధువుల కోరువారు అడ్రస్సులతో వ్రాయవలయును.

పత్రి కనకమ్మ, ప్రెసిడెంటు, ఆంధ్ర బాలవితంతు శరణాలయము, సూర్యారావుపేట, కాకినాడ.

## మా లండను జాబు

(స్వకీయవిలేఖరి)

లండను, డిసెంబరు 13:— ఇప్పటి రాజకీయ వాతావరణము గాలివానలతో నిండి భయంకరముగానున్నది. ముందుఏమి రానున్నదో ఎవరికిని తెలియదు. పాపము, కార్మిక ప్రభుత్వమువారు పరిస్థితులను చక్కబెట్ట చాలా కష్టపడుచున్నారుగాని, యిప్పటి రాజకీయ పరిస్థితులలో వారిమాటను వినువారు అంతగ లేరు. ఆంగ్ల సామ్రాజ్య విజయమంతయు ఈజిప్టు, భారతభూమివలన ఇంగ్లండునకు లభించినది. ఈ దేశములవలననే నేడు ఆంగ్లభూమి ధనలక్ష్మిని, రాజ్యలక్ష్మిని వరించియున్నది. ఈ సంగతిని యింతవరకు రాజకీయవేత్తలు బహిరంగముగ చెప్పియుండలేదు. రాజ్యతంత్రమునకు లోటువచ్చునని యీ రాజ్యములను తాము ఏలుచుండుట ఆ రాజ్యములవారి లాభముకొరకేయని ఏవో కొన్ని మధురోక్తులు చెప్పి బండాను ఆడించుచుండిరి ఇప్పుడాపద్ధతులన్నియు పోయినవి. మనసులోనున్న సంగతులను ఏమాత్రమును దాచుకొనక చెప్పుచున్నారు.

నిన్నరాత్రి ప్రభువులసభలో ఈజిప్టురాజ్యపరిస్థితులను గురించి జరిగిన చర్చలో లాయిడు ప్రభువుగారు, ఈజిప్టుదేశీయులకు, ఈజిప్టుదేశముపైన రాజ్యాధికార మిచ్చుటయన్న ఆదేశమున ఇంగ్లండుదేశపు పలుకుబడిని పోగొట్టుకొనుట యనియు, ఇంగ్లండువారు తూర్పుదేశములలో ఏకచ్ఛత్రముగ నేలవలయునన్న ఈజిప్టు దేశమున వారిఅధికారపదములో ఏమాత్రమును మార్పు చెందకూడదనియు స్పష్టముగా వచించిరి ఈజిప్టు దేశమున "మన అధికారమును తగ్గించుకొనుట" యన అదేశమున అరాజకమునకు దారి యిచ్చుటయనియు, విదేశీయుల ప్రాణములను, ధనసంపదలను, ఈజిప్టు పార్లమెంటువారి వశమునసుంచుట యనియు, ఇటులచేయుటకు ఆంగ్లదేశమువారు అంగీకరింతురా యనియు ప్రభుత్వమువారిని ప్రశ్నించిరి

ఐర్లండు విషయమున ఇప్పటివారి దృక్పథము ఇంకను మారలేదు. ఐర్లండు ఇప్పుడు స్వాతంత్ర్యరాజ్యము. తన వ్యవహారములను తాను చక్కబెట్టుకొనుటకు సర్వాధికారము కలదు. ప్రభువుల సభలో గురువారమున జరిగిన చర్చలో కార్సను మహాశయుడు ఐర్లండువారి మీద మరల దండయాత్ర ప్రారంభించినాడు. అన్నివిషయములలోను బ్రిటిషు అధికారమునకు లోబడి యుండక పోయిన ఐర్లండు వలన ఆంగ్లదేశమునకు నష్టమువచ్చునని వచించిరి ఐర్లండు వ్యవహారములలో తాము జోక్యము పుచ్చుకొనుట వారి స్వాతంత్ర్యమును తగ్గించుట యనియు, వారి విషయమున కత్తులను నూరుటకు అవసరమేమియు రాలేదనియు ప్రభుత్వమువారు వచించిరి. కాని ప్రభుత్వమువారి మాటలు మన ప్రభువులకు రుచించలేదు. పాపము ఏమిచేయగలము. నిజముగా వారిచేతిలోనే అధికారమున్న ఏమిచేయగలరో? ఐర్లండువారు ఈ పోకడలకు భయపడువారు కారనియు, ఐర్లండు వ్యవహారములలో ఇతరులు జోక్యము పుచ్చుకొనగూడదనియు ఐరిషు మంత్రి నిర్భయముగా వచించెను.

ఇట్టి ప్రశ్నలచే మనము భారతదేశము పట్లను విన వచ్చును. భారతాదర్శములను ఎంత చండాలముగ ఇప్పటి ప్రజలకు చూపవలయునో అంత జోరుగ మన "భారతదేశ మిత్రులు" చూపుచున్నారు వీరందరు మనదేశమున చాలకాలము సైనికులగనో లేక సివిలియనులుగనో నుండి పింఛను పుచ్చుకొనుచు నిప్పట నుండువారు వీరికి భారతభూమినిగురించి తెలిసినటుల ఇతరులకును అందు ముఖ్యముగ భారతీయులకు తెలియదు. ఏ సభలో గాంచినను వీరే. ఏ పత్రికలో జూచినను వీరే భారతభూమిని గురించి యొక మంచిమాట యైనను చెప్పుటకు వీరికి నోరు రాలేదు కాని యిందులకు మనమేమి చేయగలము. ఇంతవరకును వీరిని పెద్దచేసి, వీరిమీదనే మనయాశలన్నియు నున్నవని తలంచితిమి వారును మంచిమంచి తీయతీయని మాటలతో మనలను సంతోషపెట్టుచు కాలముగడిపిరి. మనయాశయములను మనము కొనసాగించుటకు మొదలు పెట్టినప్పుడు, వారెటులమాని యూరకుందురు? అంతయు కాలమహిమ? భారతభూమికి మంచిరోజులు రాకమానునా? ఈశ్వర సంకల్పము వర్ణనాతీతము. ఆయన లీలలను మనము ఆపగలమా?.

మన దేశమును గురించి యిటుల కల్లం భారతము సాగుచుండ ఈదేశములో నున్న ఆంగ్లేయులందరు వారి పక్షమున నున్న వారిని తలంచకూడదు. ఈ భారతమును "మనమిత్రులు" ఎందులకు కొనసాగించుచున్నారో వారికి బాగుగ తెలియును. "మిత్రులు" చెప్పు వానిలో నిజమేమాత్రము లేదని వారికి తెలియును. నిజ భారతభూమిని తెలిసికొనుటకు వీరు చేయు ప్రయత్నములు వర్ణనాతీతము. నేడు వీరిసంఖ్య "సముద్రములో కాకిరెట్ట" వలెనున్నను, ముందుముందు వీరి యుత్సాహము వలనను, భారత భూమిపట్ల వీరికిగల అభిమానము వలనను, ఈసంఖ్య నానాటికి హెచ్చునని చెప్పుటలో నెట్టి వింతయు లేదు. భార ఆంగ్లభూములు నిరంతర మైత్రితో ముందుముందు వర్ధిల్లవలసి యున్న, యిట్టి మహాశయుల భగీరథ ప్రయత్నముల మీదనే కార్యక్రమము కొనసాగగలదు.

## సామ్రాజ్య వ్యాపారము

ఆంగ్లభూమి తన వ్యవసాయ లక్ష్మిని మూలద్రోసిన దాదిగ, ప్రతి వస్తువునకును విదేశముల వారిమీద ఆంగ్లప్రజలు ఆధారపడుచుండిరి అటుల ఆధారపడుట ఒక గొప్పగ సైతము ప్రజలు తలంచుచుండిరి. ఈగొప్పతనమువలన దేశమునకు కలుగుచున్న ముప్పునకు లెక్కయే లేదు. వ్యవసాయము నశించినది. గ్రామ పరిశ్రమలు మూలపడినవి. గ్రామవాసులు తండోపతండములుగా పట్టణములకు దారి పట్టుచున్నారు. అందరికి తగినంత పని లేనందున నిరుద్యోగ సమస్య నానాటికి హెచ్చుచున్నది అంతయేల ప్రజలలో ఈవిషయమున గల అశాంతి చెప్ప తరముగాదు. నిరుద్యోగ సమస్య చక్కబెట్టక పోయిన ఆంగ్ల సామ్రాజ్యమునకే ముప్పు వాటిల్ల గలదు. ప్రభుత్వమువారు ఈవిషయమున చేయుచున్న ప్రయత్నములు వర్ణనాతీతము. ఇంతవరకును ఏ ఒకరిద్దరు కోటీశ్వరులచే నిర్వహింపబడుచున్న లండను బస్సులను, రైళ్లను ప్రభుత్వమువారు తమస్వాధీనము చేసికొని నడుప బూనుకొనియున్నారు. ఈరాబడివలన వచ్చు లాభములను దేశీయులకు పనిపాటలను చూపుటకు వినియోగించవచ్చును అంతియెగాదు. విదేశ సరకులు ఒక ఇంగ్లండులోనేగాక, ఇతర ఆంగ్లసామ్రాజ్యాధికార ప్రాంతములలో సైతము బాహాటముగ రానీయకుండ చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నది ఆంగ్లదేశములలోని వారికి కావలసిన సరకులు ఆంగ్లసామ్రాజ్యముననే తయారుచేయవలయుననియు, వీనికి కావలసిన పెట్టుబడి సొమ్మునకు సైతము విదేశములవారిమీద ఆధారపడక, ఆంగ్లసామ్రాజ్యమువారే సదుపాయములను చేయవలయునని యీయుద్యమ నాయకులకోరిక. ఇందును గురించి నిరంతరము పార్లమెంటులో చర్చలు జరుగుచున్నవి. విదేశవస్తు బహిష్కారము వలననే ఆంగ్లసామ్రాజ్య సంపదలు బాగుపడుననుటలో వింతలేదు. ఈ యుద్యమమున భారతదేశమునకుగల స్థానమేది? ఇందును గురించి యిప్పటి నాయకులందరు మౌనము వహించియున్నారు. ఇప్పుడు ఒక్క ఆంగ్లభూమియే వాణిజ్య విషయములలో మనల నేలుచున్నది. ఇకముందు ఆస్ట్రేలియా, న్యూజిలాండ్సు, ఆఫ్రికా, కెనడావారు సైతము మనల నేలబోవుచున్నారు. వారి వస్తువుల నన్నిటిని మన దేశములోనికి రవాణాచేసెదరు వారి సొమ్మును సైతము మన దేశముననే వ్యాపారములో పెట్టుబడి పెట్టెదరు. భారతభూమి, స్వతంత్ర భూమిగనున్న, తన వాణిజ్యపరిస్థితులను తానే చక్కగ నిర్వహించుకొనగలదు. ముందేమి జరుగునో చూడవలయును.

* * *

## భారతరాజ్యసమస్య

లండను, డిసెంబరు 19 — నిన్నరాత్రి కామన్సుసభలో భారతరాజ్య భావిసమస్యనుగురించి ప్రభుత్వమువారు అవలంబించవలసిన విధానమునుగురించి తీవ్రచర్చ జరిగినది. చర్చను ప్రారంభించిన బ్రాక్వేగారు భారతాశయములపట్ల యెక్కువ అభిమానము గలవారు భారతీయుల ఆశయముల నెంపొందించిన గాని భారత ఆంగ్ల దేశముల అన్యోన్యమైత్రి కొనసాగజాలదని యు, ఈ విషయమున ఇర్విన్ ప్రభువు, బెన్ మంత్రి ప్రకటించిన శాంతిసందేశము శ్లాఘనీయమనియు, ఈ సందేశమును కార్యరూపమున బెట్టవలయుననిన, రాజకీయ నేరస్థులను విముదల చేసితీరవలయు ననియు నుడివిరి. భారతపరిస్థితులు బ్రాక్వేగారికి చక్కగా తెలియునుగాన, సభ్యులందరు వారి యుపన్యాసము నెంతయో ఆతురతతో వినిరి. వీరితరువాత మేజరు గ్రాహాంపోలుగారు భారతీయుల కోర్కెలను కొనసాగించినగాని, ఆంగ్ల ప్రభుత్వము తమ ప్రతిష్ఠను నిర్వహించుకొనజాలదనియు, పూర్వమువలె భారతీయులకు మంచిమంచి మాటలను చెప్పి మోసపుచ్చుటకు వీలులేదనియు, ఈ వాగ్దానములలోని అంతరార్థము వారికి చక్కగ తెలిసియున్నదనియు నుడివిరి భారతీయులకు నేడు కావలసినది స్వాతంత్ర్యము తమ దేశమున [illegible] పరిసమానహక్కులతో మెలంగుటకు వారికి స్వాతంత్ర్య మీయవలయును. భారతీయులలో రాజ్యసమస్యలపట్ల, మతసమస్యల పట్ల, సాంఘికసమస్యలపట్ల భేదాభిప్రాయము లుండవచ్చును. వానిని చక్కచేసికొనువారు వారే. మన మావిషయమున జోక్యముపుచ్చుకొనుట పాడిగాదు ఇర్విన్ప్రభువు శాంతిమార్గమును చూపిరి. ఆ మార్గమున మనమునడచి భారతీయుల ఆశయములను కొనసాగించవలయును. ఇదియే మన విద్యుక్తధర్మము అని పోలుగారు నొక్కిచెప్పిరి. మేజరు పోలుగారును సభలో మాటలాడుట ఇదియే ప్రథమ తరుణము. ఇంతవరకును పోలుగారికి భారతసమస్యలపట్లగల యుత్సాహమును వినియున్నారు, కాని వారి యుపన్యాసమును సభలో వినియుండలేదు. వారి యుపన్యాసమునకు కార్మిక సభ్యులేగాక కన్సర్వేటివులు లిబరలుసభ్యులు అభినందించుచు పోలుగారి సహాయమువలన భారతసమస్యలను ముందుముందు చక్కగా తెలిసికొనగలమని చెప్పిరి. కన్సర్వేటివులపక్షమున సర్ హోర్సుగారు మాటలాడుచు, భారతీయుల ఆశయములను పెంపొందించుటయే పార్లమెంటువారికోరిక యని నేడు మనము మరలసభలో ప్రకటించుట అనవసరము. వ్యర్థప్రసంగములతో లాభము లేదని నుడివిరి. బెన్ మంత్రిగారి యుపన్యాసము వినిరేయే తీరవలయును. కోటి మాటలతో కాలముగడపుట తనధర్మముగాదనియు, భారతీయుల స్వాతంత్ర్యమును కొనసాగించుట తనవ్రతమనియు చక్కగ నుడివిరి. డెయిలీమెయిలు మొదలుగాగల పత్రికలు వ్రాయు వ్రాతలకు భారతీయులు భయపడకూడదు. స్వార్థపరులు భారతీయుల ఆశయముల భగ్నపరచుటకు చేయు భగీరథప్రయత్నములకు వెరగంద నక్కరలేదు. ఆంగ్లప్రజలు భారతపక్షమున నున్నారు. కావున భారతీయుల క్షేమముకొరకు తలపెట్టిన కార్యమును కొనసాగింతుము. పూర్వమువలె భారతీయుల స్వాతంత్ర్యమున ఏ విషయమునను అడ్డు వచ్చుటలేదు. వ్యాపారమున నేడు ఎక్కువ స్వాతంత్ర్యముగలదు. నానారాజ్యసమస్యలలో స్వాతంత్ర్యముగలదు. అంతయేల ఇతర అధినివేశ రాజ్యములవలె భారతదేశము తన రాజ్యకార్యములను నిర్వహించుకొనుచున్నది. దేశవిషయములలో సైతము సంపూర్ణ స్వాతంత్ర్యము త్వరలో బడయగలదు. ఇందు విషయమున పార్లమెంటువారు అన్నిరీతుల భారతీయులకు తోడ్పడగలరు అని నుడివిరి. తీర్మానమును వోటునకు పెట్టబడి, అందరిచేతను ఏకగ్రీవముగా నంగీకరింపబడినది.

ఈ తీర్మానమువలన కార్మికప్రభుత్వమువారు తలపెట్టిన కార్యము నిర్విఘ్నముగా కొనసాగుట కెట్టి సంశయమును లేదు. ఇంతవరకును, ప్రభుత్వమువారి ప్రకటనమునకు నిరంతరము అడ్డు వచ్చుచున్న, కన్సర్వేటివు, లిబరలు పక్షమువారును ప్రభుత్వము వారికి తోడ్పడుటకు ముందంజవేయుట ఎంతయు సంతోషము. నిన్నరాత్రి యుపన్యాసములను వినినతరువాత భారతదేశ భావోదయ విషయమున అంతగ నిరుత్సాహపడ నక్కరలేదని నేటితెల్లముగాగలదు. అందరికిని భారత సమస్య సామాన్యమైనదిగాదని చక్కగా తెలిసినది. ఏదోవిధముగ భారతీయులను పూర్వమురీతిని అదరగొట్టి కాలము గడపవచ్చునని కన్సర్వేటివు సభ్యులలో కొందరు ప్రయత్నించిరిగాని వారియాటలు సాగినవికావు. వారి నాయకుడు సర్ హోర్సుగారికి భారతసమస్యయన్న ఏమియో నేడు చక్కగా తెలిసినది. భారతవాసులందరితో సంప్రదించి, వారి యాశయములను కొనసాగించుటకు తమ పక్షమువారు సైతము సంసిద్ధులయి యున్నవారని చక్కగా నుడివిరి కార్మికపక్షమున ఒకరితరువాత నొకరు భారతీయుల ఆశయములను ప్రత్యక్షముగా గుర్తించినవారు బయలుదేరు చున్నారు ప్రభుత్వమువారికి ఈవిషయమున చక్కగ సలహా నిచ్చుచున్నారు అంతయు మంచికే

ముందున్నది ముసళ్లపండుగ. స్వాతంత్ర్య చరిత్రయందు నొక ప్రకరణము ముగిసినది నిన్నరాత్రి రెండవప్రకరణము ప్రారంభమయినది. మన ఆశయములను చక్కగా ఆంగ్లప్రభుత్వమువారికి నివేదించు బాధ్యత మనమీద కలదు కాంగ్రెసు వారు ఒక ప్రక్కన, లిబరలు పక్షమువారు వేరొక మార్గమున ఇతరులు ఇంకొకదోవను పోక, అందరును కలిసి, భారతీయుల ఆశయములను ఏకకంఠ్యమున నివేదించవలయును. ఆయన సఖ్యతను పడగొట్టుటకు ప్రయత్నములు జరుగవచ్చును ఇది మనకు క్రొత్తగాదుగదా! మనమెంతవరకు మన స్వాతంత్ర్యముకొరకు ఒకటిగ నిలచియుండగలమో గూడవలయును కష్టములు వచ్చును, కష్టములవలననే మనకు కావలసినంత ధైర్యసంపద సమకూరగలదు, భారతభూమి సస్యశ్యామలముగ "వర్ధిల్లవలయునా? నశింపవలయునా?" అను సమస్యను మనము నిర్ణయించుకొనిన, తర్వాత కదనమున అంతగ కష్టముండజాలదు.

ప్రపంచసేవలో భారతభూమి చేయవలసిన పని ఎంతయో కలదు. స్వాతంత్ర్యలక్ష్మీనిలయమై పూర్వకాలమున భారతదేశము ఈ ధర్మకార్యమును నిర్వహించి ధన్యురాలయినది. ఆనాటి ధర్మము నేడు సన్నగిల్లినది. అన్నిటికిని దాస్యురాలయి భారతభూమి తన నిజధర్మమునే మరచిపోవుచున్నది. దినములు ఈ రీతిని గడచిన భారతజనని నామము ప్రపంచచరిత్రమునుండి సంపూర్ణముగా తొలగిపోగలదు. తల్లి సేవ సామాన్యమైనదిగాదు. అన్నిటిని పోగొట్టుకొని విచారగ్రస్తురాలయియున్న తల్లికి ధైర్యము చెప్పుబిడ్డలు బయటికి రావలయును. "త్రింశత్ కోటి కంఠములు" "ద్విత్రింశత్ కోటి భుజములు" తల్లి సేవలో నున్నవనియు, తల్లినివిడచి, బిడ్డలు ఆచార్యధర్మముల నాశ్రయించరనియు, భారతజననికి ధైర్యము చెప్పవలయును. ఈ బాధ్యత మనమీదగలదు. మనబాధ్యతను మనము నెరవేర్చిన, భారతదేశమే కాక ప్రపంచమంతయు ధన్యతగాంచ గలదు. సకల చరాచరములు సుఖముగాంచగలవు.

ఎవ రీకార్యమున ముందంజ వేయగలరు?

---

## ప్రాపంచిక శాంతి

జార్జి సార్వభౌముడు ప్రెసిడెంటు హూవరుగార్లు పరస్పర నూతన సంవత్సరాభినందనము గావించుకొనిరి. ఈ సంవత్సరము ప్రాపంచిక శాంతిని నౌకాదళ నిర్ణయములవలనను పరస్పరానురాగమువలనను ఏర్పడుగాక యని ఆశించుచున్నారు.

# శాసనోల్లంఘనము

## గాంధిమహాత్ముని ప్రకటనము

"దేశమున కాంగ్రెసుసంఘము లన్నియును సరియైన ఏర్పాటుల నొనరించిన వెంటనే మేము శాసనోల్లంఘనమును ప్రారంభింపవలెను. ఈసారి శాసనోల్లంఘనము ఏదో యొక ప్రత్యేక మగు అక్రమమును తొలగించుటకు గాక సంపూర్ణస్వాతంత్ర్యమును బడయుటకే జరుపబడును. కొన్ని నెలలలోనే మేము దేశమునందు పెక్కుతావులలో శాసనోల్లంఘనమును ప్రారంభింపగలుగుదు మని నేను నమ్ముచున్నాను. ఈ ప్రయత్నము సరిగా కొనసాగినచో న్యాయస్థానములను, విద్యాశాలలను బహిష్కరింపవలసిన అవసరముకూడ కలుగదు. మరల చౌరీచౌరాదౌర్జన్యమువంటి దురాగతములు జరుగకుండుటకు తగిన విధానమునుగూడ నే నాలోచించుచున్నాను." అని గాంధిమహాత్ముడు కలకత్తాలో ఈ నెల 5 వ తేదిని ప్రెస్సునుపత్రికాప్రతినిధి కెరింగించెను. (ఫ్రీ ప్రెసు)

## కాంగ్రెసువారు శాసనసంఘ సభ్యతలకు రాజీనామాలను పంపుట

### శ్రీయుత అయ్యదేవర కాళేశ్వర రావుగారు

కాంగ్రెసు తీర్మానానుసారముగ మదరాసు శాసన సంఘసభ్యులగు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు నేడే (6-1-1930) రాజీనామాను పంపిరి. కాంగ్రెసుతీర్మానము రద్దగువరకు తిరిగి ఎన్నికకు పోటీచేయరు. (టెలిఫోనువార్త.)

### కాళేశ్వరరావుగారి ప్రకటన

మదరాసు, జనవరి 6:— భారత దేశీయ మహాసభ లాహోరులో నిర్ణయించిన ప్రకారము నేను శాసనసభాసభ్యత్వమునకు రాజీనామాను నేను పంపితిని. ఇకముందు చెప్పబడిన కాంగ్రెసువారు శాసనసభలకు పోవచ్చునని మహాసభవారు నిర్ణయించువరకు తిరిగి ఎన్నికలకు పోటీచేయదలచుకొనలేదు. పాటేల్ జరిపి రాజీనామాలనిచ్చుటనుగూర్చి యోచించినపిమ్మట రాజీనామాల నియ్యవలెనని కొందరు మదరాసు కాంగ్రెసు కౌన్సిలుసభ్యులతో నే నేకీభవింపను. దేశీయమహాసభ అందరు రాజీనామానీయవలెనని ఏనాడు నిశ్చయించినదో ఆనాటినుండియు కాంగ్రెసు కౌన్సిలుపార్టీ రద్దయినట్లే మనము వెంటనే రాజీనామా నిచ్చి కాంగ్రెసు గౌరవమును ఇనుమడింపజేయవలెను. మేము శాసనసభలలో చేరుటవలన నెట్టి ప్రయోజనము లేకపోయెననియు కాలము వ్యర్థమయ్యెననియు నేనంగీకరింపను కాని శాసనసభలద్వారా స్వరాజ్యము రాదనుమాట నిశ్చయము. కాంగ్రెసుధ్వజముక్రింద నుండి ఏకమత్యముతో పనిజేసినపుడే గమ్యస్థానముచేరగల్గుదుము. స్వాతంత్ర్యమును నూతనమూర్తి మవలంబించు చున్న యీ సమయమున కొల్లగొలది జనులయందు దేశాభిమానమును పురికొల్పి ఉత్సాహములో పనిచేయింపగల జాతీయసంస్థ యిది యొకటియే. ఎప్పుడు యీ కాంగ్రెసున కెదురుతిరుగుట యాత్మహత్యాకరము. కాంగ్రెసు సభ్యులలో ముఖ్యులు రాజీనామా నిచ్చి తిరిగి ఎన్నికకు నిలిచినచో రాజీనామా నీకుండినంత గౌరవముగనుండునో అంతే గౌరవముండును. కాంగ్రెసు విధానమునకు పూర్తిగ బద్ధులై యుండకున్నచో విదేశవస్తుబహిష్కారము శాసనోల్లంఘనము జరుపుట దుర్లభము.

### క. కోటిరెడ్డిగారు

వీరు చెన్నపురి శాసనసంఘసభ్యత్వమునకు కాంగ్రెసు సభ్యతనుగూడ నిన్న 5 వ తేదీని రాజీనామానిచ్చిరి (విలేఖరి).

### శ్రీమాన్ ఎస్. శ్రీనివాసయ్యంగారు

నిన్న 5 వ తేదీ రాత్రికి వీరు చెన్నపురి చేరిరి. భారత శాసనసభలో సభ్యతకు నేడే రాజీనామాను పంపిరి. "సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానము మహాసభలో ఆమోదింపబడుట చాల సంతోషము. డిమాక్రాటిక్ పక్షముండుట గూడ ఆవశ్యకమే" అని వీరు వచించిరి. (అ. ప్రె.)

### పండిత మోతీలాలు నెహ్రూగారు

పండిత నెహ్రూగారు 4 వ తేది లాహోరునుండి అలహాబాదుకు వచ్చిరి. లాహోరు కాంగ్రెసుమహాసభ తీర్మానము ననుసరించి భారతశాసనసభలోని సభ్యతకు ఆనాడె రాజీనామాను పంపి.

### జె. ఎం. సేనుగుప్తగారు

వంగరాష్ట్రీ శాసనసభలో కాంగ్రెసుపక్షపు నాయకుడుగానుండిన గుప్తగారు 4-వ తేది ఉదయమున లాహోరునుండి కలకత్తావచ్చి ఆనాడె రాష్ట్రీయ శాసనసంఘ సభ్యతకు రాజీనామా నిచ్చిరి. ఈశాసనసభలో సభ్యులుగానున్న కాంగ్రెసువారందరుగూడ రాజీనామాలనియ్యవలెనని సేనుగుప్తగారు సభ్యులకు పంపిరి. కాంగ్రెసు తీర్మానమును ప్రజలకు బోధించుటకు సేనుగుప్తగారు రాష్ట్రమునందంతటను సంచారము చేసెదరు.

### జె. సి. గుప్త హృషీకేశ మిత్రగార్లు

వంగరాష్ట్రీ శాసనసంఘ సభ్యులగు జె. సి. గుప్త హృషీకేశ మిత్రగార్లుకూడ 4-వ తేదీని రాజీనామాలను పంపిరి. (ఫ్రీ ప్రెసు.)

### బ్రజేంద్ర నారాయణ చౌదరిగారు

అస్సాం శాసనసభలో డిప్యూటీ లీడరుగానున్న బ్రజేంద్ర నారాయణ చౌదరిగారు గూడ 4 వ తేదిని రాజీనామాను పంపిరి.

సంయుక్తరాష్ట్రముల శాసనసంఘములో కాంగ్రెసుపక్ష కార్యదర్శియగు సంపూర్ణానందగారు 4 వ తేది సాయంకాలమునకు కాశీనగరమునకు వచ్చి వెంటనే రాజీనామాను పంపిరి. "ఈ శాసనసభలో సభ్యులుగానున్న కాంగ్రెసు వారందరును వెంటనే రాజీనామాలను పంపి ఆ విషయమును నాకు తెలుపగోరెదను. నే నావిషయమును కాంగ్రెసు అధికారులకు తెలుపవలసియున్నది" అని సంపూర్ణానందగారు సభ్యులకు పంపిరి. (అ. ప్రె.)

### సేటు గోవిందదాసుగారు

స్టేటుకౌన్సిలుసభ్యుడగు గోవిందదాసుగారు రాజీనామాను పంపిరి. (అ. ప్రె)

### ద్వారకప్రసాద మిశ్రగారు

వీరు భారతశాసనసంఘ సభ్యతకు రాజీనామాను పంపిరి. (అ. ప్రె).

### శ్రీశచంద్రదత్తగారు - సుర్మావాలీ

వీరు భారత శాసనసంఘసభ్యతకు రాజీనామా నిచ్చిరి.

### కుమార దేవేంద్ర లాలుఖానుగారు

వీరు వంగరాష్ట్రీ శాసనసంఘసభ్యతకు రాజీనామా నిచ్చిరి.

### కామిని కుమార సేనుగారు

వీరు అస్సాము శాసనసంఘసభ్యతకు రాజీనామా నిచ్చిరి. (ఫ్రీ ప్రెసు.)

### ఎం. ఆర్. జయకరుగారు

"రివ్యాన్సివ్ పక్షమువారు కాంగ్రెసు అభ్యర్థులుగా ఎన్నికలకు నిలువబడనందున వారు రాజీనామాల నియ్యనక్కరలేదు. భారతశాసనసభకు అధ్యక్షుడుగానున్న వి. జే. పటేలుగారు ఆ పదవిలోనుండి మహోపకార మొనరించుచున్నారు. కాన పటేలుగారు రాజీనామా నిచ్చుట చాల అనర్థకమే యగును. పటేలుగారు గూడ కాంగ్రెసు అభ్యర్థిగా యెన్నికలకు నిలువలేదుగాన ఆయనకూడ నియ్యనవసరములేదు. "ఇటుపైని నేను యేపక్షమునకును చేరినవాడను కాను." అని ఎన్నికొనబడిన వెంటనే పటేలుగారు చేసిన ప్రకటనను వారికి మరువగూడదు. గాంధిజీ, పండిత మోతీలాలుగార్లు తమ కిష్టములేకుండినను గూడ విధిలేక యిటుల చేయవలసివచ్చిన దనియే నేను తలచెదను. ప్రస్తుత సమయమున అన్ని పక్షములవారును యేకీభవించి చాల వివేకముతో కార్యభారములను జరుపుట అత్యవసరమై యున్నది. ఇట్టి తరుణమున అన్ని పక్షములలోను మిక్కిలి గొప్పదియగు కాంగ్రెసువారు విడిపోవుట గొప్ప దురదృష్టమే యగును అని జయకరుగారు నుడివిరి. (అ. ప్రె.)

### దివాను చమనలాలుగారు రాజీనామాను పంపలేదు

"నేను కాంగ్రెసు అభ్యర్థినిగా ఎన్నికలకు నిలువలేదు గాన నేను రాజీనామా నియ్య నవసరములేదు. వి. జే. పటేలు గారు అధ్యక్షపదవికి రాజీనామా నియ్యరని తలంచెదను" అని భారతశాసనసభలో కాంగ్రెసు సభ్యునిగా నుండి ఇప్పుడు లేబరుకమిషనులో కమీషనరుగా నున్న దివాను చమనలాలుగారు ప్రకటించిరి. (అ. ప్రె.)

## జె. ఎం. సేనుగుప్తగారి ప్రకటనము

### నిర్మాణకార్యవిధానమును కొనసాగించుటయే ముఖ్యకర్తవ్యము

1921 లో శాసనసభలను బహిష్కరించి గ్రామములలో ప్రచారము సలుపవలసిన ఆవశ్యకత కలిగినది. 1922 లో గాంధీజీని చెరసాలకు పంపినపుడు నిర్మాణకార్యనిరోధము కలిగినందున దేశబంధు దాసుగారి నాయకత్వముక్రింద స్వరాజ్యపక్ష మేర్పడి శాసనసభలలో నుండి పనిచేయుటకు తగిన విధానము నేర్పరచి ప్రజలలో ఉత్సాహమును కలిగించెను. ఇప్పుడు మరల శాసనసభలను బహిష్కరించి నిర్మాణవిధానమును కొనసాగింపవలసిన ఆవశ్యకత కలిగినది. దేశబంధు దాసుగారే యిప్పుడు జీవించి యున్నచో లాహోరు కాంగ్రెసు తీర్మానము ననుసరించి శాసనసభలను త్యజించి నిర్మాణకార్యక్రమమును కొనసాగింపవలెననియే వారు బోధించి యుందురని వారితో నాకు గలగాఢపరిచయమువలన నేను నొక్కి చెప్పగలుగుచున్నాను. ఇటుపైని అతిదారుణ మగు సంఘర్షణము జరుగవలసియున్నది. దేశములోనిజనసామాన్యము యొక్క అభిప్రాయమును సరిగా గుర్తింపగల గొప్ప నాయకుడు గాంధిమహాత్ముడొక్కడే కావున మహాత్ముడు సూచించిన విధానమే ప్రస్తుత స్థితిలో మనశక్తి ననుసరించి మనము కొనసాగించుట సర్వవిధముల అర్హమైనదిగా నున్నది. ఇట్టి సమయమున మహాత్ముడు మరల నాయకత్వమును వహించుట గొప్ప అదృష్టమే యగును. కాంగ్రెసువారిలో లాహోరులో కలిగిన చీలికలను వృద్ధినొందించి కాంగ్రెసు విధానమునకు ప్రతికూలముగ ప్రచారము నొనరించుచు మహాత్ముని పలుకుబడిని తగ్గింప జూచినచో గొప్ప హానియే కలుగగలదు. మహాత్మునికిని రాజప్రతినిధికిని జరిగిన సంభాషణలో అధినివేశప్రభుత్వము వెంటనే యొసగబడునా అని మహాత్ముడడుగగా, అటుల వెంటనే యొసగబడదని రాజప్రతినిధి స్పష్టముగా తెలిపియుండెనుగాన నిప్పుడింకొకరీతిగా తెలుపుట కట్టి అవకాశమును లేదు. కోర్టులను కూడ బహిష్కరింపవలసినదే గాన కాంగ్రెసువారి ఉత్తరువైనచో నేనందులకుగూడ సిద్ధముగానే యున్నాను" అని యీ నెల 5 వ తేదీ సాయంకాలము కలకత్తాలో శ్రద్ధానంద పార్కులో జరిగిన సభలో సేనుగుప్తగారు నుడివిరి. ఆసభకు మిక్కిలి హెచ్చుమంది వచ్చిరి. (ఫ్రీ ప్రెస్)

## కాంగ్రెస్‌కు డెమోక్రాటిక్ పార్టీకి భేదము

### ఇంకా తీవ్రమైన కార్యక్రమము నామోదించుటయే

### కాంగ్రెస్ ఆజ్ఞలను డెమోక్రాటిక్ పార్టి శిరసావహించునని సుభాస్ వ్యక్తము చేయుట

లాహోరు, జనవరి 4:— మోరిగేటు వద్ద లలమునిసిపల్ తోటలో గత రాత్రి సుభాస్‌బోసుగా రుపన్యసించిరి. సభ క్రిక్కిరిసియుండెను. నాలుగువేలకు పైగా శ్రోతలు హాజరైనట్లు సభ సలంకరించిరి. సుభాస్‌బోసుగా రుపన్యసించుటకు లేవగానే సభ్యులు హర్షసూచకములును ఆహ్వానపూర్వకములును నగు కేకలు వేసిరి. కాంగ్రెస్ మ తీవ్రముగా పోరాటము సల్పగా చేయుటయే తమ యభిప్రాయమనియు విప్లవమునందభిమానముగల వారినందరిని యువకుల ను కార్మికులను కర్షకులను బాధితులను తాము యేకముచేసి స్వాతంత్ర్యమునకై పాటుబడెదమనియు వారు చెప్పిరి.

### కాంగ్రెసువారి యాజ్ఞల శిరసావహించెదము

కాంగ్రెసు మహాసభకును డెమోక్రాటిక్ పార్టీకి నిభేదమేమని యడుగగా తాము కాంగ్రెస్‌వారి యాజ్ఞల శిరసావహించెదమనియు కాంగ్రెస్‌కంటె తీవ్రముగా పోరాటము సల్పవలయుట యొక్కటియే భేదమనియు సుభాస్‌బోసుగారు చెప్పిరి. దేశమున యింకా తీవ్రమగు కార్యక్రమమునకు తాము తయారుచేసెదరు. కొందరు యువకులను చేరదీసి క్రొత్తపద్ధతిని కామవలంబింపదలచిరి. సిక్కు యువకుడు నిరశన వ్రతము బూనగా దేశమునకెంత గౌరవము కలిగినది. నిరశనవ్రతులను ఖండించి అ. భా. కా. సంఘము గొప్ప పొరబాటు గావించిన దనియు దీని నాపాదించిన నాయకులు అనుకూలవాతావరణము ప్రతికూలముగా గావించి రనియు వారు నుడివిరి. కేశోనా రగు ఆచార్యహరిగారుకూడ ప్రసంగించిరి. (ఫ్రీ ప్రెస్.)

# శ్రీయుత సుభాష్ బోసుగారి ప్రకటన

### కాంగ్రెస్ అధ్యక్షుని నిరంకుశత్వమును, అశాస్త్రీయ ప్రవర్తనమును ఖండించుట

లాహోరు, జనవరి 5 — కలకత్తాకు వెడలుటకుపూర్వము సుభాష్ బోసుగారు ఈ క్రిందిభావమును తెలిపెడు ప్రకటనను గావించిరి —

కాంగ్రెస్ అధ్యక్షుడు యిప్పుడేకాదు, అనేకసారులు నిరంకుశముగా ప్రవర్తించియుండిరి మేము వెడలిపోయినప్పుడు అవలంబించినచర్య కట్టకడపటిది చాల నిరంకుశమైనది అపూర్వమైనది. వర్కింగ్ కమిటీలో కొందరిని, వారితో సంప్రతింపకయే తీసివేసిరి. మహాత్ముడు విపులవాక్యముతో వర్కింగ్ కమిటీ చర్యను సమర్థించెదరుగాని వాదములు మనకు నచ్చునవి కావు సభ్యుల నెన్నుకొనునప్పు డవలంబించినపద్ధతి అశాస్త్రీయము. అల్ప సంఖ్యాకుల మీద అధిక సంఖ్యాకుల నిరంకుశ పరిపాలనయును వ్యక్తముచేయుచున్నది. సత్యమూర్తిగారు దానికి తమ యసమ్మతిని జూపి లేచిపోయిరి. వారితో [illegible] వెడలిపోయిరి.

మేము వెడలిపోయిన తరువాత నవలంబింపబడిన చర్యకూడ అశాస్త్రీయమే. కాంగ్రెస్ నిబంధనలలో 24-వ నిబంధనకు అది వ్యతిరేకము.

### కాబినెట్ పద్ధతి

కాంగ్రెస్ అధ్యక్షుడు తనకాబినెట్‌ను నిర్ణయించుకొను అధికారము గలదనుట సత్యముకాదు గౌహతి, మద్రాసు, కలకత్తాలలో సహితము ఈవిధానము అంగీకరింపబడలేదు. కలకత్తాలో మైనారిటీల ప్రతినిధులు చేర్చుకొనబడిరి గాంధి మహాత్ముడుకూడ వర్కింగుకమిటీ కాబినెట్ వలె నున్నదని యనిరి ఇది సత్యముకాదు యుద్ధసమయమునందు వివిధపార్టీలవారివలె ఇప్పటికూడ 1921 సంవత్సరమునుండి వివిధపార్టీల వారును యిందు చేర్చుకొనబడుచుండిరి గాంధి జవహర్లాల్ గార్ల మనస్సులు సంపూర్ణముగా నేకమయినసంగతి విని యూరక లేమని తలచెదరో.

### బెంగాలులో శాసనోల్లంఘనము

శాసనోల్లంఘనమును తీవ్రముగా కొనసాగించెదనుగదా యీవర్కింగు కమిటీ యెన్నుకొనబడెను. బెంగాల్‌లో బండబిల్లాయనుచోట గ్రామస్థులు యూనియన్ బోర్డు పన్నులను నిరాకరించి చాల త్యాగము చేయుచున్నారు. ఇట్టి యెడల బెంగాల్ రాష్ట్రీయ కాంగ్రెస్ సంఘాధ్యక్షుడు యీ సంఘములో లేకుండుట యెట్టిది?

ఈపరిస్థితులలో మేము సభనుండి వెడలిపోవుట సమంజసమో కాదో ప్రజలు నిర్ధారణ చేసెదరుగాక. (ఫ్రీ ప్రెస్)

### డాక్టరు ఎన్. బి ఖేరుగారు

"మధ్యరాష్ట్రీయుల శాసనసభ యీ నెల 17 వ తేదీని ప్రారంభమగును ఈ లోగానే మేమందరమును రాజీనామాల నిచ్చెదము. ఇందులకు 12 వ తేదీని కాంగ్రెసుసభ్యుల సమావేశము జరుగును." అని మధ్యరాష్ట్రీయుల శాసనసభలో కాంగ్రెసుపక్షపు కార్యదర్శియగు ఖేరుగారు ప్రకటించిరి. (అ. ప్రె)

## శారదాచట్టము

### ప్రచారముకొరకు బొంబాయి ప్రభుత్వమువారి యేర్పాట్లు

శారదాచట్టమును బొంబాయి రాజధానియందంతటను ప్రచారము గావించుటకు బొంబాయి ప్రభుత్వమువారు త్వరలోనే యేర్పాటు గావించెదరు చట్టముయొక్క నిబంధనలు దేశభాషలలో ముద్రింపబడి వివిధప్రాంతములందు నుచితముగా పంచిపెట్టబడును. ఏప్రిలు 1 వ తేదినుండి చట్టము అమలులోనికి తేబడునని పెద్ద పెద్ద ప్రకటనపత్రములు (పోస్టర్లు) గవర్నమెంటు ఆఫీసులందును, పబ్లికు స్థలములయందును, అంటించబడును. కరపత్రములు గ్రామస్థుల కుచితముగా పంచిపెట్టబడి, టాం టాం వేయబడుటకు, జిల్లా కలెక్టరుల కుత్తరువు గావింపబడినది.

### మద్రాసు ప్రభుత్వమువారి యేర్పాట్లు

మద్రాసు రాజధానియందంతటను గూడ శారదా చట్టమును ప్రచారము గావించుటకు మద్రాసు ప్రభుత్వమువారు గూడ యేర్పాట్లు చేయబోవుచున్నారని తెలియుచున్నది చట్టముయొక్క ముఖ్యనిబంధనలు దేశభాషలలో ముద్రింపబడి ప్రజలకు పంచిపెట్టబడును. ఏప్రిలు 1 వ తేదినుండి చట్టము అమలులోనికి తేబడునని జిల్లా అధికారులద్వారా ప్రజలకు తెలియ చేయబడును. ("హిందూ")

## కాంగ్రెసు పక్షపు శాసనసభ్యులు

ఆంధ్రదేశమున 1926 సంవత్సరమున కాంగ్రెసు అభ్యర్థులుగా కాంగ్రెసువారిచే నియమింపబడి ఎన్నికలయందు పోటీచేసి గెలిచినవారి పేర్లను ఈదిగువ ప్రకటించుచున్నాము

| | |
|---|---|
| మద్రాసు నగరము | 1 స్వామి వెంకటాచలం శెట్టిగారు |
| | 2 డాక్టరు బి. యస్. మల్లయ్యగారు |
| | 3. పి. యస్. గోవిందరాజులు మొదలియారుగారు |
| కాకినాడ నగరము | 4. దాసరి రామసోమయాజులుగారు |
| అనంతపురం జిల్లా | 5. బి శ్రీనివాసరెడ్డిగారు |
| బళ్లారి | 6 పి శివరావుగారు |
| కడప | 7. కె కోటిరెడ్డిగారు |
| | 8 ఎ సుబ్బరామరావుగారు |
| గంజాము | 9 విశ్వనాథ దాసుగారు |
| | 10. ఎ కామేశ్వరరావు నాయుడుగారు |
| తూర్పు గోదావరి | 11 కె. వి ఆర్ స్వామినాయుడుగారు |
| | 12 చిక్కాల వెంకటరత్నంగారు |
| పశ్చిమ గోదావరి | 13 దండు నారాయణరాజుగారు |
| | 14 మోతే నారాయణరావుగారు |
| గుంటూరు | 15. వి అంజనేయులుగారు |
| కృష్ణా | 16 అ కాళేశ్వరరావుగారు |
| కర్నూలు | 17 గా. హరిసర్వోత్తమరావుగారు |
| విశాఖపట్నం | 18 పి వి. యస్ నరసింహరాజుగారు |
| | 19 పి వి వెంకటపతిరాజుగారు |

ఆదే సంవత్సరము భారత శాసనసభకు జరిగిన ఎన్నికలలో ఈ దిగువ పేర్కొనబడినవారు కాంగ్రెసుఅభ్యర్థులుగా నిలచి గెలచిరి.

| | |
|---|---|
| మద్రాసు | యస్ శ్రీనివాస అయ్యంగారు |
| గంజాము, విశాఖపట్నం | వి. వి జోగయ్యగారు |
| గుంటూరు, నెల్లూరు | బి పెరుమాళునాయుడుగారు |
| గోదావరి, కృష్ణా | టం ప్రకాశంగారు |
| దత్తమండలము, చిత్తూరు | సి దొరస్వామి అయ్యంగారు |

## రాజీనామా ఇచ్చినవారు

లాహోరు కాంగ్రెసు తీర్మానము ననుసరించి రాష్ట్రీయ శాసనసభలో ఈ దిగువ పేర్కొనబడినవారు తమ సభ్యత్వములకు రాజీనామా పంపిరి.—

1. మోతే నారాయణరావుగారు
2. అ. కాళేశ్వరరావుగారు
3. కె. కోటిరెడ్డిగారు

భారతశాసనసభ్యత్వమునకు రాజీనామా పంపినవారు

1. యస్. శ్రీనివాస అయ్యంగారు
2. వి. వి జోగయ్యగారు
3. టం ప్రకాశంగారు
5 సి. దొరస్వామి అయ్యంగారు

## మిగిలినవారి రాజీనామాలు ఎప్పుడు?

ఆంధ్రపత్రిక
1930వ సం॥ జనవరి నెల 6వ తేదీ
సోమవారము

# తీరవ్యాపార చట్ట సమావేశము

హాజీగారి తీరవ్యాపార చట్టపు సాధక బాధకములను విచారించి, రాజీ కుదుర్చుటకు సెలెక్టు కమిటీవారు ఇండియా ప్రభుత్వమువారు బ్రిటీషు నౌకా యజమానుల సమావేశమును కూర్చియుండిరి. ఈ సమావేశము నిష్ఫలమైనట్లు వార్తలు వెలువడుచున్నవి. ఇందువలన ఆశ్చర్యమే గలుగజాలదు. ఏ దేశపు నౌకలు ఆ దేశపు తీరవ్యాపారమును కొనసాగింపవలయునని, నాగరిక ప్రపంచము గుర్తించుచునే యున్నది. స్వపరిపాలనము గల దేశము లిట్టి హక్కు ననుభవించుచున్నవి. నౌకావ్యాపారమునందు అట్టడుగున నున్న హిందూదేశమునకు రక్షణ పద్ధతి మరింత యవసరము. విదేశనౌకాసంఘములు తీరవ్యాపారము నంతను స్వాధీనము చేసికొని, దేశీయనౌకల కవకాశము లేకుండ చేసినవి. దేశీయ నౌకలు తల యెత్తకుండ జేయుటకు, విదేశ నౌకా సంఘములవారు, రేట్లను తగ్గించి, పోటీపడుచున్నారు. దేశీయనౌక లదృశ్యమగుటయే తడవు, వీరు తమ రేట్లను మరల పెంచుచున్నారు. డిఫర్డురిబేటు పద్ధతిని కొన్ని కంపెనీలు కలసి యనుసరించుచున్నవి. తమ నౌకలలో మాత్రమే సరకులను పంపువారికి, కొన్ని ప్రత్యేక సౌకర్యములను వీరు కూర్చుచుందురు. తక్కువరేట్లను వీరు గ్రహించుచుందురు ఇట్టి పద్ధతుల నవలంబించుటవలన, దేశీయనౌకలు వీనితో పోటీ చేయజాలకున్నవి.

ఇట్టి కృత్రిమపద్ధతులను విదేశపు కంపెనీలవా రవలంబించుచున్నను, హాజీచట్ట మనగనే, వీరు హాహాకారములు గావించుచున్నారు. తమను నష్టపరచుట కీ చట్టము గావింపబడుచున్నదని చాటుచున్నారు. భారతీయులకు నష్టముగలిగించి, అక్రమలాభములు బడయుట, వీరికి న్యాయముగనే తోచినది. కాని దేశీయవ్యాపారరక్షణమార్గము నవలంబింప నాలపెట్టగనే, వీరు గింద్రగోళము నలుపసాగిరి. ఇట్టిచట్టముల నికమీద నిర్మించుటకు శాసనసభల కధికారము లేకుండ జేయవలయు నని, వీరు గోరుచున్నారు. ఇండియా ప్రభుత్వమువారును, యూరపియను వర్తకులను సమాధానపరచుటకై, ఢిల్లీలో సమావేశము నేర్పరచిరి విని ఏమన, బ్రిటీషు నౌకల యజమానులు తమ ప్రతినిధులను బంపక, తమ సహాకారమును నిరాకరించిరి. ఇంతకుపూర్వము హాజీచట్టమునుగూర్చి సెలెక్టుకమిటీవారు దూరమాలోచించి, అనుకూలమగు మార్పులను గావించిరి. ఇది జరిగినపిమ్మట, మరల నిట్టిసమావేశమును కూర్చుట యవసరమని తోచదు. బ్రిటీషు కంపెనీలవారు, హిందూదేశమునందే తమ కార్యస్థానము నుంచికొని, తమపెట్టుబడిని రూపాయిభాగములక్రింద మార్చవలయునని, ప్రభుత్వ ఆర్థికసభ్యుడు గోరెను గాని, వారి కది రుచింపలేదు. ఇక్కడనుండి గొంపోయిన లాభములను ఇంగ్లండునందే యనుభవింప వలయు నని, వీరియుద్దేశ్యముగ దోచును. రాజప్రతినిధియగు ఇర్విన్ప్రభువుగారు ఇంగ్లండుకు వెడలినపుడు, అక్కడ ఈ చట్టమునుగూర్చి వారు సంప్రదించిరని తెలియుచున్నది.

స్వల్పలాభముల నయినను కోల్పోవుటకు బ్రిటీషు వర్తకులు సమ్మతింప రయిరి. తీరవ్యాపారమును విడిచిపెట్టి, వీరు వెలుపలివ్యాపారమును సాగింప వీలు గలదు. దేశీయనౌకలు తమ వ్యాపారమును నిర్వహించుచో, విదేశనౌకల నన్నిటిని కొనవలయునని ప్రతినిధులు కొందరు సూచించిరట. ప్రాతవిదేశనౌకలను కొని దేశీయ నౌకాసంఘములవారు వ్యాపారముచేయుట దుర్లభము. వీరు క్రొత్త నౌకలను కొని వ్యాపారముచేయుట సులభమగును ఇప్పుడున్న విదేశనౌకలను వెలుపలి వ్యాపారమున కుపయోగింపవచ్చును. ప్రభుత్వమువారీ నౌకలను కొనగూడ దాయను ప్రశ్న వచ్చెను. ప్రభుత్వమువారయినను ప్రజల ద్రవ్యము నింతక్రింద వెచ్చించుట నష్టహేతువే యగును. ఇందుకుదోడుగ, బ్రిటీషు నౌకలకు దేశీయ నౌకాసంఘములు గుడ్‌విలు రూపమున చాలసొమ్ము వెచ్చింపవలయును ఇది యంతయు వ్యర్థవ్యయమునకు హేతువగును. ఈ రీతిని, ఎనిమిది మొదలు పదికోట్లరూపాయిలు వ్యయమగునని, యూహింపబడినది. నళినీరంజన సర్కారుగారు కలకత్తాలోని భారతీయ వణిక్సంఘమువారి యెదుట నుపన్యసించినటుల, భారతదేశము తన తీరవ్యాపారమును కాపాడుకొనుట కొకరి పెత్తన మక్కరలేదు. ఇంతకు పూర్వ మిట్టి మార్గము హిందూదేశ మవలంబింపలేదు గాన, నికముందును అట్టిమార్గము నవలంబింపవీలులేదనియు, సర్వకాలమును తమ ఆధిక్యమే నిలుపవలయుననియు, విదేశ నౌకా సంఘములు వాదించుట, నిష్ప్రయోజనము. ఇంగ్లండులో బ్రిటీషు ప్రభుత్వమువారు బ్రిటీషు సినీమాసంఘములకును మోటారు వర్తకులకును ప్రత్యేకప్రోత్సాహ మొసగుచున్నారు. ఇంగ్లండునందే యిట్టిరక్షణ యవసర మగుచుండగ, హిందూదేశమునం దది యవసరముగాదని చెప్పుట, నిరర్థకవాదము. హాజీచట్టము ఏ జాతిపట్లను ద్వేషమును వెల్లడించుటలేదు. దేశీయ వ్యాపార రక్షణను మాత్రమే పూనుచున్నది. విదేశపు నౌకల నన్నిటిని దేశీయ నౌకాసంఘమువారు కొనువరకు, నూతన దేశీయనౌకలను నిర్మింపగూడదని యూరపియను ప్రతినిధులు గోరుట విచిత్రము. అంతవరకు, విదేశీయుల పురాతననౌకలనే భారతీయవర్తకు లుపయోగించుచుండవలెనని, విదితమగును. హిందూదేశపు తీరములందు వ్యాపారమును నిర్వహించుచున్న విదేశనౌకలు పెక్కులు గలవు. వీనిని వెలుపలి సముద్రవ్యాపారమున కేల యుపయోగింపగూడదో తెలియదు. రాబోవు భారత శాసనసభలో, కాంగ్రెసు పక్షసభ్యులు హాజరుగారు గాన, హాజీ చట్టము నెగ్గు సూచనలు గనుపింపవు. హిందూదేశము స్వాతంత్ర్యము బడయువరకు, నిట్టి రక్షణపు ఏర్పాటుకై వేచియుండవలెనని తోచుచున్నది. ప్రస్తుతస్థితిలో హిందూదేశతీరవ్యాపార మభివృద్ధి గాంచుననునాశ దూరమును దొలగినది.

# కాంగ్రెసు ఆదేశము

కాంగ్రెసు ఆదేశము ననుసరించుటకు, పలువురు ముందుకువచ్చుట శుభచిహ్నము. కాంగ్రెసు సభ్యులు తమ పదవులకు రాజీనామా నిచ్చుచున్న వార్తలు లగపడుచున్నవి. ఆంధ్రనాయకులు ముందడుగు వైచుచు, ఎప్పటివలె కాంగ్రెసు ఆజ్ఞలను గౌరవించుచున్నారు. దేశనాయకు లగు పండిత మోతీలాల్ నెహ్రూగారు తమ శాసనసభ్యత్వమునకు రాజీనామా నిచ్చిరి. సేనగుప్తగారు రాజీనామా నిచ్చి, ఇతరుల నిందుకు ప్రోత్సాహపరచుచున్నారు. దేశబంధు దాసుగారీసమయమున జీవించియున్నచో, 'శాసనసభలను తప్పక బహిష్కరింప గోరెడివారని, సేనగుప్తగారు చాటుచు, గాంధిమహాత్ముడీసమయమున నాయకత్వమును వహింప నంగీకరించుటచే, వారిమార్గమున కెట్టి యడ్డంకులను గల్పింపవలదనియు, ప్రజలశక్తి కనుగుణముగ దేశము నీసమయమున నడుపుటకు గాంధీమహాత్ముడు దక్క మరియొకరు గనుపింప రనియు, ఎచ్చరించిరి. అస్సాం శాసనసభలోని శాసనసభానాయకుడును, ఉపాధ్యక్షులు నగు బ్రజేంద్రనారాయణ చౌదరిగారు తమ స్థానమునకు రాజీనామా నిచ్చిరి. శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు రాజీనామా పంపినటుల ప్రకటింపబడెను. ఆంధ్రప్రముఖు లగు వరహాగిరి వేంకటజోగయ్యపంతులుగారును, ప్రకాశంపంతులుగారును, సి. దొరస్వామిఅయ్యంగారును, భారతశాసనసభలోని సభ్యత్వములకును, మోతే నారాయణరావుగారును అయ్యదేవర కాళేశ్వరరావుగారును మదరాసు శాసనసభ్యత్వములకును రాజీనామా నిచ్చి మార్గదర్శకు లయిరి. మిగిలిన కాంగ్రెసుసభ్యులును వీరిమార్గము నవలంబించి, కాంగ్రెసుగౌరవమును పెంపొంద జేసెద రని నమ్మెదము. సంయుక్తరాష్ట్ర కాంగ్రెసుపక్ష కార్యదర్శి యగు సంపూర్ణానందగారు తమ శాసనసభ్యత్వమునకు రాజీనామా నిచ్చుచు, మిగిలినసభ్యులందరును అటుల గావించి తమకు దెలుపవలయు నని కోరిరి. శాసనసభ్యులు రాజీనామా నిచ్చుట వారికనీసధర్మ మని, లాహోరు కాంగ్రెసు సభ భావించెను. శాసనసభల వ్యవహారల నుండి విముక్తబడిన ప్రముఖులందరును తదేకదీక్షతో దేశసేవ జేయవలయుననియే, గాంధిమహాత్ముడు ఉద్దేశించుచున్నాడు. నూతనసంవత్సరమున కార్యదీక్షయే ప్రధానము. తదితరవిషయములు ప్రాముఖ్యమును బడయజాలవు. కాంగ్రెసు వర్కింగు కమిటీవారి యాజమాన్యముక్రింద, కాంగ్రెసు శాఖ లన్నియు చురుకుగ పనిచేయునని నమ్ముట కవకాశము గలదు. అస్పృశ్యతానివారణసంఘమును పండిత మదనమోహనమాలవ్యాగారి అధ్యక్షతక్రింద నికటి సంవత్సరమునందు కన్నను, ఎక్కుడు దీక్షతో పని జేయునను నాశ కెపము గలదు. అన్నిటికన్నను ముఖ్య మయినది విదేశవస్త్రబహిష్కారము. దీనికి తంతుకారకసంఘమువారు తోడ్పడుట నిశ్చయమయినను, అన్ని తరగతులవారును, అన్ని సంఘములవారును, ఇందుకై పాటుపడుట యవసరము. విదేశవస్త్రబహిష్కారము పూర్తియగుచో, స్వరాజ్యము లభించినటులనే ఎంచవచ్చును. ఈ సందర్భమున, జయరామదాసు దౌలతురాముగారు చేసిన ఎచ్చరికను గమనింపవచ్చును. సంపూర్ణస్వాతంత్ర్యమును త్వరలో బడయుటకు ప్రజలు సూశిక్షితులై

నిజేయవలయును. ఏయెడల శాసనోల్లంఘనము నవలంబించుటకు వీలుండదు. కాంగ్రెసు ఆదేశము ననుసరించి, ప్రజలు త్యాగజీవితము ననుసరించుట ముఖ్యముగు మన్నది. కాంగ్రెసు సంఘములలో నధికసంఖ్యాకులు సభ్యులుగ జేరి, విదేశవస్త్రబహిష్కారమునకును, ఖద్దరు నిర్మాణమునకును, పాటుపడ నవసరము గలదు. దౌలత్ రామునగారు సూచించినటుల విదేశ వస్త్రములను దెప్పించు వర్తకులను ప్రోద్బలపరచి, అట్టి వ్యాపారమును మానుకొనునటుల జేయవలయును. బీహారులో జయప్రదముగ నవలంబింపబడిన పద్ధతినే ఇతరరాష్ట్రములలో గూడ నవలంబింపవలయు నని, దౌలతురామునగారు కోరుచున్నారు. తగిన నిర్మాణపు టేర్పాటులు జరిగినవెంటనే, శాసనోల్లంఘనము ప్రారంభమగునని, గాంధిమహాత్ముడు స్టేట్సుమను పత్రికా ప్రతినిధితో బలికెను. ఇంతకు పూర్వము ప్రత్యేకకష్టములను నివారించుట కవలంబింపబడిన సత్యాగ్రహమార్గమే స్వాతంత్ర్య సంపాదనమునిమిత్తము గూడ నవలంబింపబడు ననియు, ఇది కొనసాగుచో న్యాయస్థానములనుగాని పాఠశాలలనుగాని బహిష్కరింప నవసరముండదనియు, మరల చౌరీచౌరాలో జరిగిన సంఘటనముల బోలునవి జరుగకుండ నివారించుటకు తా నొకపద్ధతిని యేర్పాటుజేయ ప్రయత్నించుచున్నా ననియు, గాంధి మహాత్ముడు నుడివెను. మహాత్ముని సంకల్పము నెరవేరుచో, దేశస్వాతంత్ర్యము సిద్ధించుట కెంతకాలమో పట్టదు. సంపూర్ణస్వాతంత్ర్య మనిన, ఉలికిపడిన బ్రిటీషుపత్రికలు గూడ, ఇట్టి యాశయముతో సరిపెట్టుకొన సమయ మున్నదని యెంచినటుల దోచును. హిందూదేశమునకును ఇంగ్లండుకును జరుగబోవు పరిష్కారమునందు, అధినివేశస్వాతంత్ర్యము గూర్చి యెత్తుకొనక, స్థిరమగు పరిపాలనమునే ఆధారముగ నెంచిన జాలు నని, మాంచెస్టరు గార్డియను పత్రిక హితోపదేశము గావించుచున్నది. ప్రజాశక్తి వృద్ధినొందునచో, సంపూర్ణ స్వాతంత్ర్యాధారముపై పరిష్కారము గుదురు ననుటకు సందియ ముండదు. ఈసమయమున కాంగ్రెసుసభ్యు లెల్లరును ఏకమత్యముతో కృషిసలిపి, గమ్యస్థానము జేరుట వివేకము. భేదాభిప్రాయములకును, భిన్నమార్గావలంబమునకును అవకాశము లేదు. గాంధిమహాత్ముని నాయకత్వమును దేశ మీసమయమున బడయగలుగుట అదృష్టమని భావింపవలయును. ఇట్టి యవకాశమును కోల్పోవకుండ మెలగుట, భారతీయులధర్మ మగును. ఇట్టి సందిగ్ధసమయమున మహమ్మదీయులు హిందువులతో చేతులుగలిపి పూర్ణస్వరాజ్యలబ్ధికై పాటుబడవలయునని, డాక్టరు అన్సారీగారును, మౌలానా అబ్దుల్ కలం అజాద్ గారును విన్నపము గావించిరి. హిందూదేశమును మాతృభూమిగ భావించి, మాతృదేశస్వేచ్ఛకై మహమ్మదీయ సోదరులు యావచ్ఛక్తిని వినియోగింపవలయు నని వీరు గోరుచున్నారు. వీరికోర్కె ఫలించుగాక యని కోరెదము. స్టేటుకౌన్సిలు సభ్యులగు సేతు గోవిందదాసుగారును, భారత శాసనసభ్యులగు ద్వారకాప్రసాద మిశ్రగారును తమపదవులకు రాజీనామానిచ్చిరని నేటివార్తలు దెలుపుచున్నవి. ఈరీతిని కాంగ్రెసుసభ్యులు లాహోరు కాంగ్రెసు ఆదేశమును నిర్వర్తించుటకు అహమహమికను బూని పాటుబడుచో, గమ్యస్థానము జేరుట కెంతకాలమో పట్టదు.

### లోకల్ బోర్డుల సవరణచట్టము

లోకలుబోర్డుల సవరణచట్టము గూర్చి సెలెక్టు కమిటీవారు తమ రిపోర్టును తయారుజేసి, దానిపై మొన్నటిదినము సంతకములు బెట్టిరని తెలియుచున్నది. సెలెక్టు కమిటీ రిపోర్టునందలి ముఖ్యాంశము లిదివరకు ప్రచురింపబడెను. మ్యునిసిపాలిటీల చట్టముపట్లవలెనే, యీచట్టముపట్ల గూడ మంత్రులును కొందరు అధికారులును గలిసి భిన్నాభిప్రాయమును ప్రకటించిరి. యుక్తవయస్సువచ్చినవారికి పంచాయతులలో వోటిచ్చు అధికారము నీయవచ్చునని, సెలెక్టుకమిటీవారు సూచించిరి. కాని, తాలూకాబోర్డులకును జిల్లాబోర్డులకును ఈ సూత్రము నవలంబింప వీలులేదని వారు దెలిపిరి. పంచాయతులలో గూడ నిట్టిహక్కు నిచ్చుట పనికిరాదని, మంత్రులు భిన్నాభిప్రాయము దెలిపిరి. మ్యునిసిపాలిటీల చట్టముగూర్చి గూడ వీరిట్టి ఆక్షేపణనే దెలిపియుండిరి. లోకలుబోర్డులను సూపర్ సీడు జేయుటకు యేర్పాటు లేకుండుట పాడిగాదని, వీరు సూచించిరి. ఈచట్టముక్రింద జేయు నిబంధనలకు, శాసనసభవారి అంగీకారముండవలెనను యేర్పాటును వీరు నిరసించిరి. శాసనసభ కధికార ముండుట గూడ, వీరికి బనికిరాదు. కలెక్టరులకు అసాధారణాధికారము లుండగూడదని, సెలెక్టు కమిటీవారు చేసిన యేర్పాటును వీరు నిరాకరించి యుండుట చోద్యము. స్థానిక స్వపరిపాలనస్వాతంత్ర్యము చేకూరుటకు వీరు సమ్మతింప రని తేలుచున్నది. సవరణచట్టమును వెంటనే అమలులోకి దీసికొని రావలయునను సూచనను గూడ వీరు ఆమోదింపరయిరి. వీరు దెలిపిన భిన్నాభిప్రాయమే కొనసాగునెడల, దేశస్వేచ్ఛ లభించువరకు, స్థానిక స్వపరిపాలన మయినను స్థాపింపబడజాలదని, విదితమగును.

### సహకారోద్యమము

సహకారోద్యమము గూర్చి గౌ. మంత్రి సేతురత్నమయ్యరుగారు, వాణియంబాడిసభలో గావించిన ప్రసంగమునందు, గ్రామపునరుద్ధరణమునకు సహకారోద్యమ ముపయోగపడవలయునని కోరిరి. కాని యింతవరకు జరిగిన యభివృద్ధి తృప్తికరముగ లేదని వీ రంగీకరించిరి. గ్రామములలో బీదల ఋణబాధ తగ్గవలయునని, సహకారోద్యమము కోరుచున్నది ఇందుకుగాను, ప్రజల ఆర్థికస్థితి చక్కబడవలయును. చౌకవడ్డీకి కప్పుల నిచ్చు క్రెడిటు సంఘములను నెలకొల్పినమాత్రాన ప్రయోజన ముండదు. తరుచుగ అప్పుల దీర్చవలసిన యవసరము గూడ తొలగవలయును. కో-ఆపరేటివు స్టోర్సును వివిధప్రదేశములలో స్థాపించి, ఎచ్చువెలల బాధనుండి ప్రజలను కాపాడవలయునని, మంత్రిగారు కోరిరి. నాన్ క్రెడిటు సంచలనము అభివృద్ధి గాంచవలె ననిన, అధికారవర్గములనుండి సహకారోద్యమమును తొలగించుట వసరము ప్రజ లీయుద్యమమును నిర్వహించుటకు తగిన స్వేచ్ఛ నొసగవలయును. ప్రజలు సహకారోద్యమమును జయప్రదముగ నిర్వహింపగలరనియు, జాతీయోద్యమమునకిది తోడ్పడునటుల జేయగల రనియు, ప్రస్తుతస్థితి తెలుపకనే తెలుపుచున్నది. వ్యవసాయము, చేతిపరిశ్రమలు, ఆరోగ్యము, పారిశుద్ధ్యము, నీటివసతులు మున్నగు యేర్పాటు లన్నిటికిని, సహకారోద్యమము ప్రోద్బల మొసగునటుల జేయగలుగుచో, దీనికి నూతనరూప మేర్పడి ప్రజల కిది మిగుల లాభకరముగ పరిగణింపబడగలదు.

### ఇండియా సహాయమంత్రిగారి ఆగ్రహము

నూతన ఇండియాసహాయమంత్రి యగు రసెల్ ప్రభువుగారికి, సంపూర్ణస్వాతంత్ర్యతీర్మానము ఆగ్రహము కలిగించియుండుట వింత గాదు. అధినివేశస్వాతంత్ర్యము ఇచ్చుటకుగాని చాలకాలమువరకుగాని సాధ్యపడదని, వీరు నుడివిరి. ఇట్టి నిరుత్సాహకరమగు ప్రతిపాదనములవలననే హిందూదేశము సంపూర్ణస్వాతంత్ర్యమును కోరుట తటస్థించెనని, రస్సెలు ప్రభువుగారు గ్రహించుట మేలు. కాంగ్రెసుసభవారు చేసిన బుద్ధిమాలిన తీర్మానములను లేబరుపక్షము లక్ష్యపెట్ట దని, ఇండియా సహాయమంత్రిగారు నుడివిరి. కాని అటుల లక్ష్యపెట్టవలసిన కాలము త్వరలో నరుదెంచునని, వీరు గ్రహించుట మేలు. కాంగ్రెసు తీర్మానములు బుద్ధిహీనములని వీరికిపుడు దోచవచ్చును. కాని, ప్రజాభిప్రాయతీవ్రతను గ్రహించియున్నచో, వీరటుల నుడివియుండరు. వీరి ప్రసంగము, సంపూర్ణస్వరాజ్యవాదులకు మరింత ప్రోత్సాహ మొసగు నని చెప్పవచ్చును

### గ్రంథస్వీకారము

ఆంధ్రప్రకాశికాగ్రంథమాలలో ప్రథమప్రచురణమగు "దాంపత్య" మను గ్రంథమును కృతజ్ఞతతో స్వీకరించితిమి. దీనియందు ప్రాచీనసాంప్రదాయము ననుసరించి దంపతులు తమజీవితముల నెటుల గడుపవలయునో వివరింపబడెను. ప్రాచీన ఆధునిక గ్రంథములనుండి ఆధారములు పేర్కొనబడినవి. గృహస్థాశ్రమమున ప్రవేశించిననూత్నదంపతులకీ గ్రంథము మిగుల ఉపయోగింపగలదు. గ్రంథశైలి సుబోధకముగనుండి, జీవితసాఫల్యమునకు తోడ్పడజాలియున్నది. ఈ గ్రంథము చందాదారులకు అంచెకూలీతో రూపాయి ఖరీదు అనియు, ఇతరులకు తపాలాచార్జి గాక రూపాయి అనియు, ప్రచురింపబడెను. గ్రంథమును వలయువారు:— దొంతంశెట్టి నాగేశ్వరరావు అండు బ్రదర్సు, 2 రామానుజకూటం వీధి, పాతచాకలపేట, మద్రాసు అని వ్రాసిన బడయగలరు. దొంతంసెట్టి నాగేశ్వరరావుగారి సంపాదకత్వము క్రింద ప్రచురింపబడుచున్న ఆంధ్రప్రకాశికా గ్రంథమాల, ఆంధ్రుల కుపయుక్తమగు గ్రంథరాజములను వరుసగ ప్రచురించి, సార్థకసేవ జేయుగాక యని కోరెదము.

## స్వరాజ్యపక్షమును మరల నెలకొల్పుట

### కలకత్తాలో ప్రయత్నములు

[illegible] స్వరాజ్యపక్షమును [illegible] వంగరాష్ట్రమున [illegible] ఇతరరాష్ట్రముల వారుకూడ నీపక్షమున చేరుదురు [illegible] సంఘములలోను అన్ని స్థానములకును ప్రతినిధుల [illegible] కొనవలెనని [illegible] గావించెదరు [illegible] శాసనసభలనుండి [illegible] ఇదులట యిప్పుడు వంగరాష్ట్ర [illegible] కాంగ్రెసు [illegible] లుగా నున్నవారిలో చాలమంది [illegible] నూతనపక్షప్రతినిధులుగ ఎన్నికలకు [illegible] తెలియుచున్నది. (ఫ్రీ ప్రెస్)

# విదేశవార్తలు

## భారతదేశపరిస్థితులు

### ఇండియా సహాయ మంత్రి- డొమినియను ప్రభుత్వము వీలు లేదు

(వైర్లెస్)

రుగ్బీ, జన 5— కార్మికపక్షసభలో నిన్న ఇండియా సహాయమంత్రి యిట్లు ప్రస్తావించెను:—సంపూర్ణ స్వాతంత్ర్యమును గూర్చి మాట్లాడుట ఎంత అవివేకమో భారతీయులకే చక్కగా తెలియును' ఇతరుల కంతకంటె బాగుగా తెలియదు. ఈ సమయమున డొమినియను ప్రభుత్వము సాధ్యముగాదు. చాల కాలమువరకు వీలు లేదు. ప్రజాస్వామ్యప్రభుత్వమార్గమున గ్రేటు బ్రిటను భారతీయులను గొంపోవుచున్నది. అకస్మాత్తుగ గ్రేటు బ్రిటనునుండి తొలగిపోవుట భారతదేశమునకు వినాశకరముగ నుండును ఈ అవివేకపు తీర్మానములచేతను తత్సంబంధమగు ప్రచారముచేతను కార్మిక ప్రభుత్వమువారు తమ సంకల్పమునుండి తప్పరు. శాంతముగాన్న సంగతి ద్రొక్కుదురు. ఇండియా గవర్నమెంటు స్వపరిపాలన మని వారు ప్రకటించిరి. దానికొఱకై వారు పనిచేయుచున్నారు కాని ఈ అవివేకపు తీర్మానముచే వారు ముందుకుపోకుండ ఏర్పడినది. బ్రిటనులో నున్న భారతదేశ మిత్రులందరును ఈ స్వాతంత్ర్యతీర్మానమునకు విచారించుచున్నారు.

## భారతదేశ స్వపరిపాలనసమస్యా పరిష్కారము

### మాంచెస్టరుగార్డియను

(రూటరు)

లండను, జన 4:—మాంచెస్టరుగార్డియనుపత్రిక ఇట్లు వ్రాయుచున్నది —గ్రేటుబ్రిటను ఇండియా లాభమునిమిత్తము ప్రత్యేకముగ ఇండియా గ్రేటుబ్రిటనుతో ఏర్పాటులు చేసికొన్నను అంత్యపరిష్కారసమయమున ఇండియా గ్రేటుబ్రిటను డొమినియనుప్రభుత్వ మను పదమును వదలుకొనవలెను. పండిత జవహరిలాలుగారి సమాన సంపత్సామ్రాజ్యసిద్ధాంతములయందు మాకు గౌరవమే. కాంగ్రెసుతీర్మానములు ఆయన సిద్ధాంతములు అటులుండనీయదు. ఇండియాలో స్థిరముగ ఏర్పడు గ్రొత్త ఇండియాప్రభుత్వమువారు మామూలువర్తకనీతిని అనుసరించి తమవెనుకటివారు తీయవలసిన అప్పులను తీర్చుట వివేకమని గ్రహించెద రనుకొనెదము. మతో భారతరాజ్యాంగవేత్తలెవరైన రాయబారములనుసల్ప మర్దించుచో వారు డొమినియను ప్రభుత్వవాదులో, సంపూర్ణస్వాతంత్ర్యవాదులో మేము మరుగము. ఇండియాలో వారు స్థిరమగు స్వపరిపాలనము నిర్మించి పాలించగలవిధానమును జూపగలరా యనియు మంచిదగువిధానముకంటె మంచివిధానమును జూపగలరో యనియే యడిగెదము. అట్లు చూపగల్గుచో తప్పక వారిమాట వినెదము. లేక వారు చిక్కులనుతొలగించుటకు ప్రారంభించుచో మాశక్తివంచనలేక వారికి సహాయము చేసి తీరెదము. ఇది అంత్యము డొమినియనుప్రభుత్వము గానిండు సంపూర్ణస్వాతంత్ర్యము గానిండు కాని ముందు స్వపరిపాలనమునకు ప్రథమకర్తవ్యము శాసనబద్ధులై యుండుటయే.

## పలస్తైను అల్లరుల విచారణసంఘము

(వైర్లెస)

రుగ్బీ, జనవరి 5 —పలస్తయిను అల్లరుల విచారణసంఘమువారు లండనులో నిన్న తిరిగివచ్చిరి 9 వారములు పనిచేసిరి. లండనులో మరికొందరు సాక్షులను విచారించెదరు. కొద్దివారములలోనే నివేదిక వెలువడును.

ఇటలీరాజకుటుంబములో జరుగువివాహమునకు యార్కుప్రభువు పార్యకొమునితరపున రోమునకు బయలుదేరెను.

## భారత దేశము

### స్మట్సుసేనాని

(రూటరు)

లండను, జనవరి 4 —స్మట్సుసేనానిగా రిట్లు వాకొనుచున్నారు:— భారత సమస్యలం దుదకు హాయిగ పరిష్కారమగునను నమ్మకముగలదు. భారతీయులు తొందరపడిన మేముశాంతమును వహించెదము. అవివేకమునకు వివేకమును జూపెదము. ప్రాణాధారమగు వట్టియు ముఖ్యమగు వట్టియు స్వపరిపాలనముతో గూడుకొన్న డొమినియను ప్రభుత్వసిద్ధాంతముకు వర్తింపజేసి దుదకు ఫలప్రదముగ పరిష్కరించెదము

గౌ॥ శ్రీనివాసశాస్త్రిగారు నూతన సంవత్సర బిరుదములతో సత్కరింపబడుటవలన వారి కెంతయు యభినందించుచు సహృద్భావ మేర్పడుటకు వారు పునాదులను వేసిరనియు అదియే వారి స్మారకచిహ్నముగా చిరస్థాయిగనుండు ననియు కేపుటైమ్సుపత్రిక వ్రాయుచున్నది.

సర్ కే. వి. రెడ్డిగారు అనారోగ్యముగ నుండుటకు విచారించుచు వీరొకచేళ తిరిగి రాజాలకున్న వీరిస్థానే త్వరగా ఇంకొకరిని నియమించి స్థిరముగ శాస్త్రిగారు పాతిన చెట్టు అశ్రద్ధచే చావకుండుటకు ఇండియాప్రభుత్వమువారు ఇంకొకరిని నియమింపవలె నను చున్నది

భూకంపముచే ట్రాన్సుఅట్లాంటికు తంతివార్తలు ఇంకను అలక్ష్యముగానే వచ్చుచున్నవి నవంబరు 18 వ తేదిని న్యూఇంగ్లండు తీరము మధ్యాహ్నము భూకంపము గన్పించెనట. నోవాస్కోషియా, న్యూబన్విక, మూర్పుస్యాచెటులో కొన్ని ప్రాంతములందుగూడ సోకెనట

ఇర్విను ప్రభువునకు ఆర్డరు ఆఫ్ ది సెంటు జాన్ ఆఫ్ జెరూసెలం, నైటు ఆఫ్ జస్టిసు అనియు, ఇర్వినుప్రభ్వి డేము ఆఫ్ గ్రేసు అనియు, గౌ॥ ఛటరీ షామ్నీసుగారిని అందులో సభ్యునిగ చేర్చి గౌరవించిరి

మధ్యధరా సముద్ర నౌకాదళముతో నుండుటకు నిర్మింపబడిన రిపోల్సు అను నౌకానిర్మాణము చాల నుండిదట.

## వాతావరణస్థితి

1930 సం॥ జనవరి నెల 6-వ తేది సోమవారము

| ముఖ్యజిల్లాలు | గత 24 గంటలలో అత్యధికోష్ణస్థితి | గత 24 గంటలలో అత్యల్పోష్ణస్థితి | గత 24 గంటలలో వర్షము | జనవరి 1-వ తేదినుండి వర్షము | సాధారణముగ సంభవించవలసిన దానికి తేడా |
|---|---|---|---|---|---|
| గోపాల్ పూర్ | ... | ... | ... | ... | ... |
| విశాఖపట్టణము | 79 | 64 | ... | 0 | — 0.1 |
| కాకినాడ | 79 | 63 | ... | 0 | — 0.1 |
| మచిలీపట్టణము | 80 | 65 | ... | 0 | 0 |
| కర్నూలు | 91 | 61 | ... | 0 | 0 |
| బళ్లారి | 86 | 64 | ... | 0 | 0 |
| అనంతపూర్ | ... | ... | ... | 0 | 0 |
| కడప | 86 | 65 | ... | 0 | — 0.2 |
| నెల్లూరు | 84 | 70 | ... | 0 | — 0 6 |
| మద్రాసు | 72 | 71 | 0 2 | 0 2 | — 0.1 |
| కడలూరు | 77 | 71 | 0 9 | 1 0 | — 0 5 |
| వెల్లూరు | 81 | 66 | ... | 0 | — 0 8 |
| సేలము | 86 | 70 | ... | 0 | — 0 1 |
| కోయంబత్తూరు | 87 | 68 | ... | 0 | — 0.3 |
| తిరుచునాపల్లి | 81 | 72 | ... | 0 | — 0 2 |
| నాగపట్టణము | 78 | 72 | 3 5 | 6.3 | + 4.0 |
| మధుర | 85 | 74 | ... | 0.1 | 0 |
| పాంబన్ | 78 | 75 | 0.1 | 2 9 | + 2 1 |
| పాలంకోట | ... | ... | ... | 0 | — 0 5 |
| తిరువేంద్రము | 84 | 76 | ... | 0 | — 0 2 |
| కొచ్చిన్ | 87 | 75 | ... | 0 | — 0 3 |
| కాలికట్టు | 91 | 72 | ... | 0 | — 0.1 |
| మంగుళూరు | 90 | 72 | ... | 0 | 0 |
| బెంగుళూరు | 84 | 62 | ... | 0 | — 0.1 |
| మెర్కారా | 78 | 58 | ... | 0 | 0 |
| కొడైకెనాల్ | 63 | 49 | † | 0 1 | — 0.9 |
| కూనూర్ | 67 | 48 | ... | 0 | |

ఉత్తరసర్కారులు:—గోపాలపురము కబురు తెలియరేదు. ఇతరచోట్ల మబ్బు గాఢముగనున్నది. శీతోష్ణస్థితి మామూలుగానే యున్నది.

దక్కను:—కడపలో మబ్బు దట్టముగానున్నది. కర్నూలులో పగటివేడిమి 4 డిగ్రీలు తక్కువ.

కర్నాటకము:—కడలూరులో 0.9 మద్రాసులో 0 2 వర్షించెను. మబ్బు విస్తారముగనున్నది. పగటివేడిమి మద్రాసు కడలూరులలో 5,6 డిగ్రీలు తక్కువ. రాత్రివేడిమి 2 మొదలు 4 డిగ్రీలు ఎక్కువ.

ఎ. ఎ. నారాయణయ్యరు,
వహాయ వాతావరణ శాస్త్రజ్ఞుడు.

### కీ॥ శే॥ ఏ. మధ్వరావుగారు బి. ఏ.

(ప్రత్యేకవిలేఖరి)

గత డిసెంబరు 27 వ తేదిని ఉదయమున కర్నూలు తహసీల్దారగు శ్రీ ఏ. మధ్వరావుగారు, బి. ఏ. కొలది రోజుల జ్వరముచే అకాలమరణము గాంచిరని తెలుపుటకు మిగుల చింతించుచున్నాము. వీరు చనిపోవునప్పుడు 50 యేండ్లు వయస్సు కలిగియుండిరి. కర్నూలు మండలమున వీరు 25 యేండ్లకాలము తహసీల్దారుగను, ప్రభుత్వ సంబంధమగు యితర ఉన్నత ఉద్యోగములందును పనిచేసి ఉద్యోగుల యొక్కయు ఉన్నతోద్యోగుల యొక్కయు మరియు మంచిప్రజల యొక్కయు ప్రశంసబడసిరి. శవదహన సందర్భమున పెక్కుమంది పురజనులు ప్రభుత్వోద్యోగులగు డిప్యూటీకలెక్టరు సాంబారు అద్దదారు మొదలుగాగలయు యితర ఉద్యోగస్తులును వచ్చి కీర్తిశేషులైనవారి పట్ల తమకున్న అత్యంత గౌరవమును ప్రీతి పానభూతిని వెల్లడిచ్చిరి. వీరు తనపతిని ఒక కుమారుని, పలుగురు పుత్రులను యితర బంధుమిత్ర బృందమును దుఃఖసాగరమున విడనాడి దివంగతులైరి.

# దేశీయవార్తలు

## విప్లవ సూచకములగు ప్రకటన పత్రములు

కలకత్తాలో నచ్చటచ్చట గానవచ్చుట

కలకత్తా, జన 4:— కలకత్తాలోని హాజిపద్ రోడ్డునందు సియాల్దాస్టేషను యెదుటను, భవానీపురమునందును, విప్లవ సూచకములగు ప్రకటనపత్రములచ్చటచ్చట నేటియుదయమున నంటింపబడి యుండెను. పోలీసువారు వానిని తమ వశమొనర్చుకొని, వానిని వ్రాసినవారిని గురించి వాకబు చేయుచున్నారు. (శ్రీ ప్రె)

## పెషావరునందలి రఘునాథాలయము

సిక్కుల గురుద్వారముక్రింద మారనుండుట

ప్రభుత్వమువారినిస్సహాయస్థితి

పెషావరు, జన 4:—పెషావరు నగరమునందలి రఘునాథాలయము పడగొట్ట బడకుండు నట్లొనరింపుమని కోరుతంతివార్తలనేకములు ప్రభుత్వమువారికి వచ్చుచున్నవి. పత్రికలలో ప్రచురింపబడిన వ్యాసములనుండియు, సమావేశములలో గావింపబడిన తీర్మానములనుండియు నేమి తేలుచున్నదనగా. ప్రభుత్వమువారొకక జిల్లామేజిస్ట్రేటుగారి వారాలయమును పడగొట్టవలయునని యాజ్ఞ నొసంగిరని యొక దుర్భ్రమ ప్రజలలో కలిగియున్నది.

యథార్థ వృత్తాంతము

ఈ విషయములో గడచిన ఏడు సంవత్సరములాదిగా వ్యాజ్యములు జరుగుచుండినవి. వీనికి ఫలితముగా, ప్రస్తుతము 'రఘునాథాలయము, మనబడు స్థలము యథార్థమున సిక్కులగురుద్వారమేయనియు, అందుచే నాలయపు వ్యవహారకర్త సిక్కు 'గ్రంథసాహెబ్'ను ఆకట్టడములో ప్రతిష్ఠ యొనరింప వివ్వవలయుననియు, మరియు సిక్కు మతమునకు విరోధమగు హిందూమూర్తుల నాలయమునుండి తీసివేయవలయుననియు జిల్లాజడ్జిగారు సిక్కుల కనుకూలముగా తీర్పు నొసంగిరి. ప్రతివాది సరిహద్దు ప్రాంతమునందలి ప్రధానన్యాయస్థానమున కపీలు చేసెను గాని, గెలుపొందలేదు. కావున న్యాయశాస్త్రానుసారముగా జేయవలసిన ప్రయత్నములన్నియు ముగిసినవి. ఇక డిక్రీదారుడు తన డిక్రీని యమలులో బెట్టుటయే తరువాయి.

ప్రభుత్వమువారి రాజీప్రయత్నములు

ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గము వారీ వ్యాజ్యములలో నే జోక్యమును కలుగజేసికొని యుండలేదు. కేవలము, రెండు పక్షములవారికిని రాజీయొనర్చుటకు యత్నించి విఫలులైరి.

అధికారముగల న్యాయస్థానమువారి డిక్రీని చీఫ్కమిషనరుగారుగాని, తదితరయుద్యోగస్థులెవరైనగాని ప్రస్తుతపరిస్థితులలో త్రోసివేయజాలరు. (అ ప్రె)

## బ్యాంకింగు విచారణ సంఘోద్యోగుల సమావేశము

చర్చింపబడిన విషయములు

కలకత్తా, జన 4 —ఇండియాయందలి యన్ని బ్యాంకింగు విచారణ సంఘములయొక్కయు అధ్యక్షులును, కార్యదర్శులును సర్ పురుషోత్తమదాస్ ఠాకూర్ దాస్ గారి యధ్యక్షతను సమావేశమయిరి. నేటి సాయంకాలము సమావేశము ముగిసెను.

నేటియుదయము కలకత్తాకు విచ్చేసిన సర్ బాసిల్ బ్లాకెటు గారు సమావేశమునకు వచ్చియుండిరి. బెంగాలు, అస్సాము, చెన్నపురి, బొంబాయి, పంజాబు, ఢిల్లీ, బీహారు, ఒరిస్సా, బర్మా, మధ్యసంయుక్త ప్రాంతములనుండియేగాక, పాటియాలా, బికనీర్, బరోడా, తిరువాంకూరు, ధార్ మొదలగు స్వదేశసంస్థానములనుండియు ప్రతినిధులు విచ్చేసియుండిరి. అప్పుచేయుట, నివేదికలను తయారు చేయుట, సాక్షులను విచారణగావించుట, వ్యవసాయదారులకు కావలసిన ధనము, దేశీయుల పెట్టుబడి మొదలగు విషయములను సమావేశము వారు చర్చించి యుండిరని తెలియుచున్నది. (శ్రీ. ప్రె.)

## మధ్యపరగణాల శాసనసభా కాలపరిమితి

హెచ్చింపబడుటకు కారణములు

నాగపురం, జన 4 —శాసనసభకు నూతన సభ్యుల నెన్నుకొనుటని నియోజకవర్గముల వారిని కోరుటకుముందే సైమను సంఘమువారి సిఫార్సుల నాకళింపగియుండుట మంచిదని భావించుచు, మధ్యపరగణాల తాత్కాలిక గవర్నరు హానరబుల్ ఠంబీగారు తమశాసనసభాకాల పరిమితిని వచ్చే ఆగస్టునెల 31వ తారీఖువరకు హెచ్చించుటకు తీర్మానించిరి (అ. ప్రె)

## అఖిలభారత మహిళామణుల సమావేశము

విద్యా, సాంఘిక సంస్కారములు చర్చింపబడును

ఆహ్వానసంఘ కార్యదర్శిని ప్రకటన

బొంబాయి, జనవరి3 — పైసమావేశముయొక్క ఆహ్వానసంఘ కార్యదర్శినియగు శ్రీమతి హంసా మేతాగారు బొంబాయిలో యీనెల 30 వ తారీఖునుండి 24 వ తారీఖు వరకు జరుగనున్న సమావేశమునకు రాదలచెడి ప్రతినిధులను, ప్రేక్షకులను యీ క్రింది సంగతులను తమకు తెలుపకోరుచున్నారు —

(1) బొంబాయిలో ప్రవేశించెడి సమయము, ఏ స్టేషనులో దిగునది,

బసయేర్పాట్లను తామేగావించుకొనెదరా, లేక ఆహ్వానసంఘము వారిని యేర్పాటు చేయుమనెదరా,

(3) తామే యేర్పాట్లు చేసుకొనదలచినచో, బొంబాయియందలి తమ విలాసము,

(4) శాకాహారులా, కారా?

స్థాయిసంఘ సమావేశము

స్థాయిసంఘసమావేశము యీనెల 16 వ తారీఖున జరుగును గాన, తత్సంఘసభ్యులకు జనవరి 15 నుంచియే స్వాగతమొసంగబడును. తదితర ప్రతినిధులకు, ప్రేక్షకులకు 18వ తారీఖునుండియే 25వ తారీఖువరకు ఎట్టి ప్రతిఫలమును కోరకయే యాతిథ్య మొసంగబడును.

ప్రతినిధులును, ప్రేక్షకులును పరుపుపడకలను వారే తెచ్చుకొనవలయును

ప్రేక్షకులవద్దనుండి మనిషికి దినమునకొకంటికి విదురూప్యములు తీసికొనబడును.

కొలాబా, విక్టోరియా టెర్మినసు స్టేషనులకే స్వచ్ఛంద సేవకులు పంపబడుదురుగాన, ప్రతినిధులను ప్రేక్షకులును నీ రెండింటిలో నొకదానివద్దనే దిగవలయునని కోరబడుచున్నారు

కార్యదర్శిని విలాసము:—23, నేపియన్ సీరోడ్డు-బొంబాయి. (శ్రీ ప్రె)

### బెంగుళూరులో ఒక అద్భుతమగు సహగమనము

బెంగుళూరనుండి యొక విలేఖరి యిట్లు వ్రాయుచున్నారు:—వెంకోజీరావు అను పేరుగలకిల్లాబాంకుయొక్క గుమాస్తా కొలది కాలము క్రిందటనే చనిపోయెను. అప్పటి కాతనికి 35 యేండ్ల వయసుండెను. ఇరువది వేల రూప్యముల ఆస్తియుండెడిది. తనకుగల ధనమును విస్తారముగా వెచ్చించి తన యాస్తినంతయును శ్రీరామునియారాధనమునకే వినియోగింప నుద్దేశించి యుండెను. కాని తన యుద్దేశము నెరవేరకముందే యితడు చనిపోయెను. తన భార్యపేరు వెంకటలక్ష్మమ్మ. ఈ మహాపతివ్రత తన పతివెంట దివికేగుటకు నిశ్చయించి ఆత్మహత్య గావించుకొన యత్నించెను. కాని తనభర్తయొక్క యుద్దేశమును నెరవేర్చుటకామె యాత్మహత్య గావించుకొనకుండ ఆటంకపరుపబడెను. ఒకనాటిరాత్రి యామె స్వప్నములో తులసీ రామదాసుని శిష్యుడగు రంగస్వామిదాసుగా న్పించి తన భర్త యుద్దేశమును నెరవేర్పవలెనని గోరెను. అవెంటనే యామె తులసీరామదాసుమఠములో శ్రీరామ, లక్ష్మణ, సీతా, హనుమంతుల విగ్రహములను ప్రతిష్ఠించి, తనయాస్తినంతయు, యీ దైవముల శాశ్వతపూజకు వినియోగించుటకు వీలు వ్రాసియిచ్చెను. తరువాత యీ మహాపతివ్రత, గత డిసెంబరు 29 వ తేది ఆదివారమున తెలవారుజామున నిద్రనుండిలేచి ప్రాతఃకాలస్నానమాచరించి, దేవాలయమున ధనుర్మాసపూజ జరుగుచుండగా, యచ్చటిభక్తులతో తనభర్త యుద్దేశము నెరవేర్పగలిగినందుకు తన సంతృప్తిని దెలిపి, యీ ప్రపంచమందింకను తాను జీవింపవలసిన యవసరములేదని చెప్పి, యానాటి సాయంకాలమందే యసువులబాసెను.

చిత్రకళ లేనిదే, శోభింపదు, సాఫల్యముకాదు. నాట్యమున కట్టి పరస్పరాలంబన భావముకలదో, నాట్యమునకును, చిత్రమునకును, అట్టి అన్యోన్యసంబంధము కలదని నా మనవి.

### "ఖద్దరు వస్త్రధారణము"

భారతదేశీయ కళలను సముద్ధరింప నడుకట్టిన మీరు మన దేశాభ్యున్నతికి తోడ్పను. ఖద్దర్ వస్త్రములను ధరింపవలయు ననియు, మీ నాట్యరంగములందు ఖద్దర్ వస్త్రాలంకారములతో నాటక ప్రదర్శనముల కావింపవలయుననియు, యితర పరికరములను గూడ మనదేశమందు తయారు కాబడినవాట్లనే మీ నాట్యరంగములందు ఉపయోగింపవలయుననియు, విలాసార్థములుగాక దేశాభ్యున్నతికి తోడ్పడు నాటకములను ప్రదర్శింపవలయుననియు, సర్వకళలున్నూ అవినాభావ సంబంధము కలవియైనగాన కళాపరిషత్తులు అన్నియు ఏకకాలమున ఏకప్రదేశమందు ప్రతిసంవత్సరము జరుపుటవలన కళోపాసకులకు ఎక్కువ వివయగ్రహణకు సావకాశము యుండునవియు మనవిచేయుచున్నాను. విజ్ఞులకు, వివేచనాశీలురకు, స్వదేశాభిరతులకు, రసజ్ఞులకు ఇంతకన్న తెలుపలేను.

### స్వవిషయము

శ్రీ గాంధిమహాత్ములవారి ఆంధ్రదేశ సంచారమున ఏలూరు పురమునకు విచ్చేసిన తరుణమున "ఆంధ్ర చిత్రకళాపరిషత్తు" అను పేర మా చిత్రకళాపరిషత్తు శ్రీ మహాత్ములచే ప్రారంభోత్సవము జరిపించి ఏర్పాటు కావింపబడినది. ఏతత్సమయమున శ్రీ మహాత్ములవారి సమ్ముఖమున మాచిత్రములన్నియు ప్రదర్శింపబడినవి. మా సన్మానపత్రముతో మాపరిషత్తుచిత్రకారులగు చంll రామారావు గారిచే చిత్రింపబడిన బుద్ధుడు సుజాత చిత్రపటము మహాత్ములకు ఒసంగితిమి. శ్రీమహాత్ముల లిఖితపూర్వక మహదాశీర్వచనమునకు పాత్రులమైతిమి. శాస్త్రీయముగూరుగు కరుబోధనమును సాధనమున నంచితిమి. కించిత్ పుణ్యవశమున ఘటించిన సంస్కారముతో, మాపరిషత్తు చిత్రకారులగు చంll బాపిరాజు, రామారావు, సోదరద్వయముచే భావములు వివిధ చిత్రింపబడినవి. ప్రదర్శనములలో కొన్ని మైసూరు మహారాజా, పాటియాలా మహారాజావార్లవంటి రసజ్ఞశేఖరులచే సార్థకమును అదృతిని బడసినవి.

ఏతాదృశమగు నాదరములు మాకు కొంతవరకు ప్రోత్సాహకారణమే అయినది. ఈ మా పరిషత్తుకళావికాసమునే ఉద్దేశించినదగుట, అభిరుచిగలవారి నాదరించి శిక్షింప నడుకట్టినది. కొందరు బాలురు ఇప్పుడు శిక్షనొందుచున్నారు. చేయవలసిన పనియింతయు ముందున్నది. దేశభక్తినిరతులును, భారతకళాభిమానులును, వదాన్యులును, మా యీ ఉద్యమమును ప్రోత్సహించి పోషించుదురనియే నమ్ముచున్నాము. ఈ పోషణమునకే పోషకుల ధన్యతయు, మమ్మువంటి ఉపాసకుల సార్థకతయు కలదు.

వందేమాతరం.

## ఇండియను రివ్యూ

సంపాదకులు రావుబహదరు. జి. ఏ. నటేశంగారు, జార్జిటవును, మద్రాసు

ముప్పదవ సంపుటము 12 వ సంచిక 1929 డిసెంబరులో వెలువడినది. కృతజ్ఞతతో నందుకొంటిమి. ఇది ఆంగ్ల భాషలో నెలకొకసారి ప్రకటింపబడుచుండును. సాలునందా 5 రూపాయిలు. ఒక సంచిక వెల 8 అణాలు. ఈ సంచికలో సర్ పి.ఎస్. శివస్వామయ్యరుగారు వ్రాసిన "సంస్థానములు-అధినివేశ స్వాతంత్ర్యము" అనునదియే ప్రధాన వ్యాసము. క్రేటు యూనియను తగాదానుగూర్చి పి. శివరావుగారును, ఎస్. పి శర్మగారును వ్రాసిరి. బ్రిటిషు స్త్రీలను గూర్చి జస్టిసు నాల్లుగారు వ్రాసిరి. ట్రినిడాడులోనున్న భారతీయుల స్థితినిగూర్చి పి. ఎస్. అంబ్రోసుగారు వ్రాసిరి. మరి పెక్కు వ్యాసములుగూడనిందుగలవు.



## శ్రీకృష్ణాశ్రమము-గుంటూరు

ఆంధ్రపత్రికాముఖమున 8-11-1929 వ తేదీని పత్రికా విలేఖరి ప్రకటించిన విషయములయందలి సత్యాసత్యములను తెలియబరచవలసినదని శ్రీ కొల్లి సత్యనారాయణ చౌదరిగారిని 14-11-29 తారీఖున కార్యనిర్వాహకవర్గమువారు తీర్మానరూపముగా కోరినారు. కార్యదర్శి నల్లపాటి హనుమంతరావుగారు 18-11-29 వ తేదీ ఆంధ్రపత్రిక సైతీర్మానమును ప్రచురించుచు చౌదరిగారిసంజాయిషీ రాగానే తనమీది ఆరోపణల కన్నిటికిని సమాధానము పత్రికాముఖమున ప్రకటింతు మని వ్రాసినారు. 26-11-29 వ తేదీన చౌదరిగారు కార్యనిర్వాహక సభలో తమ సంజాయిషీ వ్రాసి ఇచ్చి దానిని ప్రకటించవలసినదనియు అట్లు చేయనియెడల తామే ప్రకటింతు మనియు చెప్పినారు. కార్యదర్శిగారు మరుసటి కార్యనిర్వాహకసభలో సమాధానము నిర్ధారణచేసి ప్రకటింతు మని చెప్పినారట. 2-12-29 వ తేదీన సభ జరిగినను ఈ విషయము చర్చకే రాలేదు. తరువాత గొన్నాళ్లకు శ్రీ సత్యనారాయణ చౌదరిగారే తమ సంజాయిషీ ఈపత్రికలోనే ప్రకటించవలసివచ్చినది.

పత్రికాముఖమున ప్రకటితమయిన ఆరోపణలకు నేటికిని హనుమంతరావుగారు నేటివరకు సమాధానము వ్రాయలేదు. మౌనము అర్ధాంగీకారసూచక మని సూక్తి. స్వశక్తిలోపము లను సంస్కరింప బూనుటవల్ల సంస్థలు కూలిపోవు నను భ్రమ విద్యావంతులకు కూడ నుండుట విచారకరము.

లోకుల ధనసహాయముమీద ఆధారపడు సంస్థలను నిర్వహించువారు ఎవరడిగినను సమాధాన మియ్యవలసి యుండును. శ్రీకృష్ణాశ్రమ కార్యనిర్వహణములో చాలా లోప మున్నట్లు నాకు తెలిసి ఆరోపములను సవరణ చేయించుటకై నేను మరి కొందరు సభ్యులును కొంతకాలమునుండి సక్రమాందోళనము (Constitutional Agitation) చేయుచున్నాము. ఆశ్రమకుల పతియైన శ్రీ కల్లూరి సుబ్బారావు శంకరశాస్త్రిగారిని తొలగించుటకై కార్యనిర్వాహకవర్గములోని ఒకరిద్దరు సభ్యులు చేయు ప్రయత్నములకు అడ్డు కలిగించుటకే నేను ఆందోళన చేయుచున్నా మని వారు చాటుచువచ్చిరి. శాస్త్రిగారు ఆశ్రమములోని తమ ఉద్యోగములకు రాజీనామా ఇచ్చి నప్పటినుండియు, నేను బ్రహ్మసమాజసభ్యుడ నగుటచేత, హిందూధర్మములు ఆదర్శముగా గల శ్రీకృష్ణాశ్రమమును బ్రహ్మసమాజాశ్రమముగా మార్ప యత్నముచేయుచున్నానని వారు దుష్ప్రచారము చేయుచున్నట్లు తెలియవచ్చినది. నేను గాని ఇతరసభ్యులుగాని చేయు ప్రయత్నము బ్రహ్మసమాజమునకు సంబంధించినది కాదనియు, శ్రీకృష్ణాశ్రమనిర్వహణములోని లోపములను సవరణచేయించి సంస్థను వృద్ధిలోనికి తేవలెనని మా యభిప్రాయ మనియు ఆంధ్రమహాజనులకు మనవిచేయుచున్నాను.

తెలికిచర్ల రామమూర్తి

## జాతీయ మహమ్మదీయ పక్షము

### 'కాంగ్రెస్‌లోచేరి జాతిమతవివక్ష లేక సంపూర్ణ స్వాతంత్ర్యమునకై పోరాడుడు'

### డాక్టరు అన్సారీ, అబ్దుల్ కలమ్ ఆజద్‌గార్ల ప్రకటన

ఢిల్లీ, జనవరి 5:—జాతీయ మహమ్మదీయ పక్షమువారిచే కోరబడినవారై డాక్టరు అన్సారీ, అబ్దుల్ కలమ్ ఆజద్ గారలు పార్టీ తరపున యీ క్రింది ప్రకటన గావించుచున్నారు:—

లాహోరు కాంగ్రెసు మహాసభవారిచే గావింపబడిన ముఖ్య తీర్మానములు ఆశయములయందును, పద్ధతులయందును సంపూర్ణ నగు మార్పును ప్రకటించుచున్నవి. ఇప్పుడు భారతీయు లంగీకరించిన సంపూర్ణ స్వాతంత్ర్య గమ్యస్థానమువలన భారతీయు లందరును జాతివర్గ మతవిభేదములు లేక తత్సిద్ధికై పాటుబడవలె నని స్పష్టమగుచున్నది. ఇదివరకు వివిధసంఘములకు చేర్పడిన విభేదము లిప్పు డంతరించవలెను. సంపూర్ణస్వరాజ్యమునకై పోరాటము ప్రారంభింప బడుటవలన ఫలితముల విషయము వెనుకబడిపోయినది ఏలయన, పోరాట జరుగుచుండగా హక్కులనుగూర్చి విచారించుట యనవసరము మాత్రమేగాక, కృతఘ్నతకూడ నగును. కావున వివిధసంఘములవారును హక్కుల విషయము కట్టిపెట్టి మొదట స్వాతంత్ర్యమునకై తమ విధ్యుక్తమును నెరవేర్పవలెను.

### మహమ్మదీయులు కాంగ్రెసులో చేరవలసిన యావశ్యకత

కాంగ్రెసువారి యాహ్వానము నంగీకరించి మహమ్మదీయులు సంతోషపూర్వకముగా తమ మాతృభూమికి సేవ చేయుట విధియనుట స్పష్టము. నెహ్రూ రాజ్యాంగ విధానము రద్దయినదనియు, మైనారిటీ లందరకును సమ్మతమయి నంతవరకు నేరాజ్యాంగమును కాంగ్రెసువారి యామోదమును బడయదనియు కాంగ్రెసువారు స్పష్టముగా తెలియజేసినారు. గనుక మహమ్మదీయులు కాంగ్రెసులో చేరి సంపూర్ణ స్వాతంత్ర్యమునకు ప్రయత్నించుట తమ విధ్యుక్తమగుచున్నది. అధినివేశ ప్రతిపత్తి నాధారము చేసికొని రచియింపబడినదనిన నెహ్రూనివేదికయెడల నసమ్మతి ప్రకటించుచుండిన వారిని ప్రత్యేకముగా మేమిప్పు డాహ్వానించుచున్నాము. వారందరును సన్నద్ధులై వచ్చి కాంగ్రెస్‌వారికి చేయూత నొసంగెదరు గాక. దేశమునకై త్యాగము చేయుటలో మహమ్మదీయులెప్పుడును వెనుకబడలేదు. దేశముయొక్క ఈ సందిగ్ధావస్థయందు ఆమె యండనిలచుట తమ ధర్మమని వారు తలచి, స్వాతంత్ర్యలకు భారతీయుల కృతజ్ఞతకు పాత్రులయ్యెదరు గాక. అ. ప్రెస్.




# దుర్గామెడికల్‌హాల్

గవర్నరుపేట, బెజవాడ.

## గనేరియా మిక్స్చర్

గ్యారంటీగా 8 రోజులలో కుదురును

(1) ఈమందు సెగరోగములను నివారించి మూత్రము విడుచునప్పుడు గలుగు పోటు, మంట, చురుకును యింకను అనేక చిచ్చుకారిలలోను నివారణమాసేకుండ తప్పక కుదుర్చును సీసా 1-కి రు 3-0-0.

## మూర్ఛారిష్టము

(2) ఈమందు యెటువంటి మూర్ఛలైనను యెన్ని సంవత్సరములనుండియున్న మూర్ఛలైనను గ్యారంటీగా కుదుర్చును. నెలకు సరిపోవుమందు రు 3-0-0.

## పాడలకు తైలము 131

(3) ఈ తైలము తెల్లపాడలకే గాక యితరవిధము లైన పాడలను గూడ పోగొట్టును ఇంకను తామర, గజ్జి, శర్వాంగ సుందులంగాగల అన్ని విధములైన చర్మవ్యాధులను పోగొట్టి చర్మమును మామూలుస్థితికి మార్చును డబ్బీ 1 కి రు 1-0-0

"గుంటూరు జిల్లాకు యేజెంట్లు — ఇండియన్ యింపీరియల్ హోము గుంటూరు."

ఏజెంట్లు కావలెను. 131

# శుక్రబంధు

ఎంత దుర్బలమైన వీర్యముకైనను గట్టిపరచి ఒక్కొక్క బలోనే అద్భుతమైన ప్రభావమును చూపును. శుక్లనష్టమును కట్టుటలో పేరుపొంది, స్త్రీపురుషులకు నిరతిశయమైనసుఖము కలిగించుటకు దీనిని మించిన ఔషధము లేదు. 25 కు 2-8-0

## చందనాదివటి సెట్టు 4-0-0

పిగవ్యాధులకు దివ్యౌషధం ఇచ్ఛాపథ్యములు చాలును ఆరోగ్యము

## రత్నపురుష లేహ్యము పేరు డబ్బీ 3-0-0

వీర్యవృద్ధికి పేరుపడిన ఔషధము.

17-3 త్రిపురసుందరీ వైద్యశాల,

మహేంద్రవాడ-రామచంద్రపురంపోష్టు, గోదావరిజిల్లా

# రు 100 బహుమానం

తెనుగులిపిలోనున్నట్టియు, బాలబాలికలైనను చదువుటకు వీలున్నట్టియు అనేకమహాపండితుల ప్రశంసాపత్రములు బొందినట్టియు మార్గప్రమాణములతో గూడ రు 3-10-0 విలువగలిగినట్టియు మా యేడు సంస్కృతపుస్తకములకొఱకు ముందుగా మూడు కాసులు పంపి ఆపుస్తకముల తెప్పించుకొని చదివి తుదు చేయుపరీక్షలలో శ్రేష్ఠజయమును (ఫస్టుక్లాసు ప్యాసు) పొందువారికి నూరురూపాయలు బహుమతి ఇయ్యబడును. కావలసిన వ్రాయవలెను

శ్రీకృష్ణ సంస్కృతగ్రంథమాల, పిఠాపురము

బలహీనము, రక్తములు చెడినచో

# రక్తశోషి

Deschiens'syrup

ఆరోగ్యము, బలము కల్పుటకు 30 000 వైద్యులు వ్రాయుచున్నారు. లభించును

To be bad of Chemists C T HARI 145 Broadway Madras.

# సంతానం పుట్టకుండా

## 'కాంట్రా సెప్టిన్'

ఒక్కటే 106-1

సులభమైన సురక్షితోపాయం

16 మోతాదుల ట్యూబు 1-12-0

ట్యూబులకు ఇతర వివరములకు.—

## ది సోషల్ హైజీన్ సిండికేట్

1/3, అఫర్సన్ వీధి, బ్రాడ్వేవద్ద మద్రాసు.

# వనౌషధిశబ్దార్థనిఘంటువు.

మూలికలు 25,000 సంస్కృతశబ్దములకు తెలుగు అర్థములు కలవు. క్యాలికోబైండు వెల రు 3-4-0 అ.

## భస్మప్రదీపిక

"ఇందు సమస్త లోహములు శుద్ధిచేసి భస్మములుచేయు యోగాలు ఆయుర్వేదవిధానముతో కలవు. 1-కి రు 500 లకు మించిన భస్మములు గూడ కలవు. క్యాలికోబైండు వెల రు 2-0-0

48 శెట్టి సోదరులు, రాయవరము, గోదావరి.

# కృష్ణాఫార్మసీ, బెజవాడ

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే ఆయుర్వేదౌషధములన్నియు విరివిగా తయారుచేయబడి మునిసిపాలిటీలు, తాలూకాబోర్డులు మొదలగు గొప్పగొప్ప సంస్థలకు సప్లయిచేయుటకు సిద్ధముగ నున్నవి 10-1

వ్యాధులులేవు పిమ్మట శీఘ్రము

# మలయచందనము

రహస్యముగా సేవించదగినది

## గనేరియా (సెగ)కు కుఠారము, 3 పూటలలో గుణము కలుగును

ఆయుర్వేదశాస్త్రరీతిగా పొందినది వెల డబ్బీ 2-4-0 చీము కసపాదం చందనతైలం ఔన్సు 3-0-0 రెండును కలిపి 5-12-0

## సుధాసారము, సవాయికి రాజౌషధము సీసా 4-0-0

102-1 గంధర్వఫార్మసీ, రాయవరము, గోదావరిజిల్లా. 72

Printed and published by K. Nageswara Rao, Editor, Andhrapatrika Power Press, 6 & 7, Thambu Chetty Street, Madras